

శ్రీసద్గురవేనమః

# శ్రీ [illegible]
# చిరుతల భజన

గ్రంథకర్త:

ముప్పిడి నారాయణ

మో|| పెదకందుకూరు,



సంస్కర్త

అంబేదరాజ పీరప్ప

మో|| గౌరాయపల్లి


ప్రకాశకులు:

కొండా వీరయ్య అండ్ సన్స్

పుస్తకముల వ్యాపారము,

మహాకాళివీధి — సికిందరాబాద్


హక్కులు ప్రకాశకులవి ] 1957 వెల 1-0-0

# యిందులోవచ్చు పాత్రలు



## పురుషులు

౧ సుబుద్ధి
౨ ద్రుపదుడు
౩ వ్యాసులవారు
౪ ధర్మరాజు
౫ భీముడు
౬ అర్జునుడు
౭ నకులుడు
౮ సహదేవుడు
౯ జ్ఞానంభట్లు
౧౦ సుజ్ఞానంభట్లు
౧౧ గంధర్వుడు
౧౨ దుర్యోధనుడు
౧౩ శకుడు
౧౪ కర్ణుడు
౧౫ ద్రోణాచారి
౧౬ భీష్మాచారి
౧౭ దుశ్శాసనుడు
౧౮ సైంధవుడు
౧౯ శల్యుడు
౨౦ దృతరాష్ట్రుడు
౨౧ విదురుడు
౨౨ కృష్ణమూర్తి
౨౩ బలరాముడు
౨౪ శిశుపాలుడు
౨౫ జరాసంధుడు
౨౬ దృష్టద్యుమ్నుడు

## స్త్రీలు

౧ కుంతిదేవి
౨ కుంభీనసి
౩ ద్రౌపతిదేవి



గ్రంథకర్త సంస్కర్త

ముప్పిడి నారాయణ, అంబేదరాజవీరప్ప, వొట్టిపల్లి ముత్యాలు

# గ్రంధకర్త వంశావళి

## సీ స మా లి క

శ్రీకరంబై మహాశ్రేయముగ వెలసినా। తాలూక భువనగిరి తహాతుయనగ । కొమరొప్ప పెదకందుకూరులో నెలవైన । కొండిన్య రుషిగోత్రి గౌడవర్ణ । ముప్పిడి మల్లయ్య ముదిత ముత్తెమ్మకూ । సుత సుతులిరువురము హితవుమీర । రామక్క పిదప నారాయణుండనువాడ । జన్మించియును జగజ్జనని కృపచె । గౌరిపల్లి రాజవీరప్ప దయవలన । కవిలక్షణంబెరగి కడుముదమునా । సారసమునుగలా భారత కధలోన । ద్రౌపతి స్వయంవరము దనరగాను॥ గీ॥ కోరికతొ చిరుతల భజన కృతి యొనర్చి । పద్యపదములస్వీచల బలుముదమున । వ్రాసితిని యూహచే యిట్టి పుస్తకములొ । తప్పులున్నను దిద్దుడో ధన్యులారా।

## గు రు స్తు తి

కం॥ శ్రీరాజవీరు గురుపద
సారసములు నమ్మివారి ♦ సత్ కృపవలనన్
భారతమునగల పాండవ
సీసులకధ భజనవిధము ♦ విరచించెదనూ ॥

ఇట్లు
ముప్పిడి నారాయణ

# నూతనముగా రచియింపబడి అమ్మకమునకు

# సిద్ధముగా నున్న చిరుతల నాట్య గ్రంథములు

| | |
|---|---|
| చిరుతల శ్రీమహాభారతము | 1-8-0 |
| చిరుతల గాంగేయోపాఖ్యానము | 1-0-0 |
| చిరుతల కాంతామతి | 1-0-0 |
| చిరుతల సత్యహరిశ్చంద్ర | 1-0-0 |
| చిరుతల కనకతార | 1-0-0 |
| చిరుతల శ్రీకృష్ణరాయభారము | 1-0-0 |
| చిరుతల మైరావణ | 1-0-0 |
| చిరుతల సుగ్రీవవిజయం | 1-0-0 |
| చిరుతల సంపూర్ణ బాలనాగమ్మ చరిత్రము | 1-0-0 |
| చిరుతల హనుమద్విజయము అ॥ రా॥ | 1-0-0 |
| చిరుతల పద్మవ్యూహము ( గౌరాయిపల్లె అంకితము ) | 1-0-0 |
| చిరుతల భద్రసేన విలాసము | 1-0-0 |
| చిరుతల గయోపాఖ్యానము | 1-0-0 |

* అచ్చులోనున్నవి *

| | |
|---|---|
| చిరుతల బకాసురవధ | 1-0-0 |
| చిరుతల పాశుపతాస్త్రం | 1-0-0 |
| చిరుతల ఉత్తర గోగ్రహణం | 1-0-0 |
| చిరుతల సైంధవ పరాభవం | 1-0-0 |
| చిరుతల దక్షయాగము | 1-0-0 |


వలయువారు:-

కొండా వీరయ్యా అండు సన్సు,

పుస్తకముల వ్యాపారము - మహాకాళివీధి

సికింద్రాబాద్.

( అనివార్యుడు )

ఓం

శ్రీనీలకంఠాయనమః

# ద్రౌపదీస్వయంవరము

## చిరుతల భజన



### ఈశ్వర ప్రార్థన

కం॥ శ్రీకరకంఠ మహేశ్వర
నాకాధిప గంగ గిరిజ ♦ నాయక శంభో
లోకోద్ధారణ పురహర
ప్రాకటముగ బ్రోవుదేవ ♦ భవభయదూరా॥

### విఘ్నేశ్వర ప్రార్థన - దర్వు

శ్రీగణనాయక దేవ శేషభూష మహాప్రభావ । సాగిలినే మ్రొక్కుచుంటి వేగమె కరుణించు స్వామి । శ్రీగణనాయక దేవ శిష్టపాల మహాప్రభావ ॥శ్రీగణ॥ తొలుతనిన్నె దలచెద మృదుపలుకు లొసగి బ్రోవుదేవ । పలువిధముల సదయము నీ ప్రార్థన యేమారకుందు ॥శ్రీగణ॥ వాసిగ పెదకందుకూరి దాసదాసులను బ్రోచెటి ॥ మూషకవాహన నిన్నే ముదమున భజియించెదాను ॥వాసిగ॥

### శారద ప్రార్థన

కం॥ శ్రీవాగ్వాణీ నిను నా
భావమునను దలచి నెపుడు ♦ భక్తితొ గొలుతున్
కేవలముగ సద్వాక్యలు
యేవేళ్ళను యొసగిబ్రోవు ♦ యింపుదలిర్పన్॥

### కీర్తన

శ్రీవాగ్వాణీ నిను నాభావమునను నమ్మియుంటి । బ్రోవుము నీదయ బూనియు బుధజనపావని జననీ ॥శ్రీవాగ్వాణీ॥ అంబేధా రాజవీరవ్వ చరణ

ములు నమ్మియు । సంబరంబునా ద్రౌపతి స్వయంవరము రచియించెద । శ్రీవాగ్వాణీ । ధానుశి పెదకందుకూరి నారాయణ దాసునెపుడు । కూరి మిత్రో బ్రోవ్రుజవని కోరిదలచుచుంటి శ్రేణీ ॥శ్రీవాగ్వాణీ॥

వ॥ యిట్లు యిష్టదేవతా ప్రార్థనంబును శిష్టకవిజనాభి వందనంబు లాచరించి శ్రీఅంబేద రాజవీరప్పగారి సునయోక్తులవలన నాచే యొనర్పం బూనిన ద్రౌపతీ స్వయంవరము కథాక్రమం బెట్టిదనినా.

సుబుద్ధియనే ప్రధాని ప్రవేశం – దర్వు

శ్రీమాధవునీ మదిలో స్మరించెటి । నామము వినుము సుబుద్ధినిరా। భూమీశుని సన్నిధిలో నెప్పుడు । పొందుగ నేచరియించెదరా ॥శ్రీమాధ॥ మందరాద్రి సమధీరుడ నేసిక । మహాబలశూరుడను వినరా । అందము గను పెదకందుకూరు శ్రీ । నంద కొమారుని మరువనురా ॥శ్రీమాధవునీ॥

వ॥ నరెవరె నేను బలపరాక్ర విక్రముండనై ఖండన జయుండనై రారాజులగ్రోలక మెలంగుచు మెప్పునడసిన నానామము సుబుద్ధియని యందురు వోహో యిప్పడు ద్రుపదమహారాజు విచ్చేయుచున్నాడు వారికి యెదురుగా జనియెదగాక.

చెత్రి.

రాధేకిష్ణ గోపాలకిష్ణ । మాధవ మదుసూదన శ్రీక్రిష్ణ ॥ కిష్ణ కిష్ణా గోవింవకిష్ణా । గోవర్ధనధర గోపాల కిష్ణా ॥

శ్రీ వేణుగోపాల స్వామికి జై,

దృదపమహారాజు ప్రవేశం – దర్వు

దురవిజయుండను దోర్బలశూరుడ । దృపదుండను రాజునువినరా । ధరలో వైరుల దర్పమణంచియు ధన్యతనొందిన వాడనురా ॥దుర॥ ప్రాకట ముగ పాంచాల దేశమును । పరిపాలించెటి ప్రభుడనురా । లోకంబున ప్రఖ్యాతి వహించిన । రాకుల వంశజుడను వినరా ॥దుర॥ సుత ద్రౌపతి యును సుగుణ విశాలి । సుతుడును దృష్టద్యుమ్నుడురా । క్షితిలోనను పెదకందుకూరి శ్రీ । పతిత పావనుని మరువనురా ॥దురవిజ॥

వ॥ సచివా మాపరాక్రమవిక్రమంబెరుంగకుంటివా శ్రుతపరచెద వినుము పాంచాల దేశమును పరిపాలించె ద్రుపదమహారాజయని గొల్పయాడెదరు కావున నొక సంగతి నెరంగించెద వినుము.

సీ॥ ద్రోణుని వాక్యచే దురము జేసియునన్ను ♦ బంధించి గురుని పద
మందువైచె ♦ అలనాడు ప్రాకటని అర్జునుని కీడుమనని ♦ ప్రతిన
బూనియుప స్త్రి పరగనచట ♦ కౌరవేయుడు వార్ని కపటచితముచేత ♦
నడికేయి యగ్నిచే మడయజేసె ♦ ప్రతిన వ్యర్థంబాయె ఫల్గుణుడు
మరణించె ♦ యెట్లు జేయుదును యీ పట్లనేను॥ గీ॥ పరగ వ్యాసుల
వార్ని రాపరచి యిట్టి ♦ అంతు తెలిపియు నేవారి యాజ్ఞతీరు ♦
మెలగువాడను కావునా యిలలొ నాదు ♦ వ్రాలు నొదటిబ్బలుండగా
మేలుయెట్లూ॥

వ॥ సేవకా నొకనాడు గురుని కానుకగురించి ద్రోణాచారి వాక్యచే పాండవ మధ్యముడైన అర్జునుడు నన్ను బంధించి ద్రోణాచారి పాదముల పైన బడవైచెను. అందుకు నేను జేసిన ప్రతిన యెట్టిదనగా యీ ప్రతాప శాలియైన ఫల్గుణునకు నాసుతను నొసంగి వివాహంబు గావించెదనని వాగ్దానంబిడి వస్తిని పిదప నచట కురువంశజుడైన దుర్యోధనుండు పాండవేయులపై పగదలంచి లక్క గృహంబు నిర్మించి అందున వారలనివ సింపజేసి అర్థరాత్రివేళ అగ్ని ముట్టించి పాండవులను దగ్ధంబు గావించెను. యిప్పుడు యీ వీరపరాక్రముడైన కిరీటి మరణించి నందులకు నేను జేసిన ప్రతిజ్ఞ వ్యర్థంబాయెనని వ్యాకులంబొందుచుంటిని. యిందులకై యిప్పుడువ్యాసులవారిని రావించి యిట్టిఆలోచన కనుగొనెదగాక.యింతలో

వ్యాసులవారు ప్రవేశం – దరువు

వాసుదేవుని ధ్యానయొనర్చెటి । వ్యాసమునీంద్రుండను వినరా । వాసిగాను యిహసౌఖ్యంబులనూ । రోసివేసినా వాడనురా ॥వాసు॥ సాదన ముద్రల సంగతెరంగియు । మోదమొందిన వాడనురా । యీ ధరణిలొ పెదకందుకూరి శ్రీ । మాధవుని మది దలచెదరా ॥వాసు॥

వ॥ శిష్యతిలకా సాంఖ్యమనస్క తారక పరిపూర్ణ భావంబెరంగి సదా శ్రీ భగవానుని పదంబుల స్మరించుచు తపోవనంబున మెలంగెద

నానామునుము వ్యాసమునీంద్రుండని గొనియాడెదరు ఆహా యింతలో నాకొక మనవి జ్ఞాపకము వచ్చెను పంచపాండవులు లక్కాగృహమునుండి వెడలి యేకచక్రపురంబున భూసురవేషంబులతో నివాసముజేసిరి కావున యిప్పుడు పాంచాల దేశంబునకెగల ద్రుపదమహారాజు సన్నిధికిజని హితవాక్యంబులచే పాండవులకు ద్రుపదునకు బంధుత్వం బొనగూర్చెదగాక.

దరువు - చెల్తి

రావా దేవా। హే రాధాలోల నను రక్షణజేయగ ॥రావా॥ దేవ నీవు యీ దీనుని మొరవిని । బ్రోవగరావా భోగిశయనహరి ॥రావా॥ గానలోలా । నను గావగనీకే కరుణ సముదా ॥గానా॥ పూనియు తమ పద ధ్యాన్నము నెప్పుడు । మానసముననే మరువక దలచెద ॥రావా॥ మోదామోగా । యిల ముప్పిడి నారాయణను బ్రోచెటి ॥మోదా॥ వేదవేద్య దామోదర శౌరీ । ఆదరించుమా హరి శ్రీమాధవ ॥రావా॥

సం-వ॥ యిట్లు విచ్చేయుచున్న వ్యాసులవారిని ద్రుపదమహారాజు గాంచి. (తనలో)

వ॥ వోహొ వ్యాసమహానుభావుడు నేను తలచిన విధముగనే విచ్చేయుచున్నాడు యెదురుగాజని వందనంబాచరించువాడను.

వ్యాసులవారికి - ద్రుపద మహారాజుకు - వాదం

ద్రుప॥ వందనమిదుగో। వో వ్యాసమహానీయ మీకు ॥వంద॥ పొందుగ మీరిందుజేర సందేహము వీడెస్వామి । అందముగను యిచ్చట సింహాసనమున నివసించుడి ॥వంద॥

వ్యాసు॥ అందమొందగా । జయమొందుచువర్ధిలు ద్రుపదా ॥అంద॥ పొందుగ నీ ముఖవన్నె పొలిక తగ్గియున్నది । సందేహము లేక తెలుపు సంశయ మేదియు గల్గెనా ॥అంద॥

ద్రుప॥ వోతపోధనా । నే శ్వేతవాహానునకు సుతను ॥వోతపో॥ నీతితోడనిచ్చుటకును ఖ్యాతిగ ప్రీతిన యుండెను । భూతలమున మరణమయ్యె పోయిరి పాండవులు యెటుల ॥వోతపో॥

వ్యాసు॥ భూతలాధిపా । బలుభూరి బలులు పాండవులు ॥భూత॥ చాతుర్య వంతులైనాను చచ్చెనరని మనుసొప్పదు । ఖ్యాతిగ పెదకందు కూరి కరివరదుఁడే బ్రోచును ॥భూత॥

వ॥ ద్రుపద ।మహారాజ యీ పాండవేయులు మరణించిన వార్త బ్రతికియున్న వార్త నామనంబునకుఁ నెద్దియుఁ దోచుటలేదు. వాకవేళ్ళ పాండుసూనులు బ్రతికి యుండిన యెడల వారలు బయలుపడే యుక్తి నెరంగించెద వినుము.

ద్రుప-వ॥ మునీశ్వరా అదెట్టి విచారణయో విన్నవించుడు.

వ్యాసుల వారికి - ద్రుపదునకు - వాదం

వ్యాసు॥ ధరణీశ్వర వరసూనులగను గాన । తెరంగెరింగెటి మరుగు దెలిపెదను । వెరహొందక నీ వినియెదనంటెను । అరమరలేకను అదియును దెలిపెద ॥ధర॥

ద్రుప॥ పరమ పురుష మీ పదముల నమ్మియు । పరిపరి విధముల ప్రార్థన జేసెద । వరకొమారుల మరుగు దెలుపుడీ । త్వరగ యొనర్చెద తాతసోత్తమా ॥పరమ॥

వ్యాసు॥ ద్రౌపతి స్వయంవరమని నీవిప్పుడు । ధరణీశులకును లేఖలు బంపుమీ । భూపవినుమ యీభుజబలశూరులు । భువిపైనున్నను వ్రాని వచ్చెదరు ॥ద్రౌపతి॥

ద్రుప॥ తాపసవర మీ వాక్కులు నమ్మియు । భూపతులకు లేఖలు బంపించెద । పాల్పుగ యింకేపనులు జేయవలె । నోపివినుపు వో వృత్తమ శీలా ॥తాప॥

వ్యాసు॥ మరుగెరగించెద మత్స్య యంత్రమును । యిరవొందగనూ యింతలో నిలుపుమీ । తెరంగెరింగియు తెగటార్చినయా । పురుషునకిడు నీ పుత్రికనిప్పుడు ॥మరు॥

ద్రుప॥ సరెసరె నామది సమ్మోదమాయెను । సభ నిర్ణయమును చయ్యన జేసెద । ధరణి కందుకూరి ధాముని నమ్మియు । త్వరగ మత్స్య యంత్రము స్థాపించెద ॥సరెసరె॥

వ॥ తపోధన మీరను విధంబుగనే మత్స్య యంత్రంబు ఒన్నెద గాకా.

వ్యాసు-వ॥ నరవర నీవిప్పుడు మహీపతులకు దెల్పెవిధ మేమనగా మత్స్యయంత్రమును తెగటార్చిన వారికి ద్రౌపతిని నొసంగెదనని లేఖలు వ్రాసి పంపుము యివీ గాంచి లోకంబున పంచపాండవు లున్నచో యాఫల్గుణుండెయిందరు దేరగలడు. వొకవేళ్ళ యామహానీయులు లేకున్నచో అంతటి శూరుడే తెగటార్చగలడు. కావున నీవు ద్రౌపతి స్వయంవరమని దేశాధీశులకు తెలియపరచిమత్స్యయంత్రంబు స్థాపింపుముయిక నేజనువాడను.

దృప-వ॥ సరేసరె మీరను విధంబుగనే వ్రాయువాడను యిట్లు దెలిపి వ్యాసులవారు వెళ్ళిపోయిన పిదప దృపద మహారాజు లేఖలు వ్రాయుట.

సీ॥ శ్రీయుత ధరపాల శ్రేష్ఠులకును దృపద ♦ భూవరుండును వ్రాయు
భావమిదియు ♦ సుకుమారి ద్రౌపతికి శుభలగ్నమును జేయ ♦ స్వయం
వరము నిర్మిస్తి సంతసమున ♦ సభనుజేరగవచ్చి సాహసంబున నిలచి ♦
వడిబాణమును బట్టి కడురయమున ♦ మహావిచిత్రంబైన మత్స్యయం
త్రము దెంచి ♦ మ పవను చేకొనుడు మాన్యులార ♦ యంత్రమును
గొట్టె విధమును యెట్టులనగ ♦ వొక్కసారె బాణంబును యెక్కుబెట్టి ♦
వామనేత్రముకు గొట్టియు భూమిపైన ♦ బడగవేయవలె యిది యంత్రి
ప్రతిన వినుడీ ॥

వ॥ యిట్లు శుభలేఖలు వ్రాసి దేశాధీశులకుబంపినంతలో.

పంచపాండవులు భూసుర వేశంబులతో - ప్రవేశం

ధర్మరాజు - దర్వు

శ్రీవేణుగానలోల శ్రితజన రక్షణశీలా । దేవకివసుదేవ తనయ దేవ దేవ బ్రోవరావ ॥శ్రీవేణు॥ గోవర్ధనగిరి గోకులనంద కొమార । పావనాంగ దశవేషా పాపసంహారా రావా ॥గోవ॥

వ॥ దేవా దీనదయాకర కపటవాదియైన దుర్యోధనునిచే కడుయిడుముల నొందుచు యీ యేకచక్రపురంబున విప్ర గృహంబులలో భిక్షమెత్తుచు జనని సహోదరులతో నిచ్చట నుంటిమి దేవా మా ప్రార్థన లాలించి మాబాధలు దీర్చుటకు నీదేభారము దేవా దివ్య ప్రభావా.

భీముడు ప్రవేశం - దర్వు

మురళీధర నీచరణము లరదుగ నమ్మియు గొలచెద । పరమాత్మ పరమపురుష ప్రార్థన గైకొనుము ॥శ్రీశా॥ మాపాలి దైవాము మాధవ మము కృపగనుమా । యేప్రొద్దు నీ స్మరణ యేమారను కరుణాకర ॥మురళ॥

వ॥ నందనందనా యీసుయోధనుని మాయోపాయంబులకు సంత సించి మా పెదనాయన్నగారు కపట భావంబుచే మమ్ముల తీర్థయాత్రలు సేవించిరాండని నానా యిడుములపాలుజేయగా తమ పాదకృపవలన. యీ యేకచక్రపురంబున జీవించుచున్నాము. క్రిష్ణా మము దరిజేర్చె భారము నీదే జనార్ధనా.

అర్జునుడు ప్రవేశం - దర్వు

మధుసూదన కేశవహరి మాధవ మాంపాహి శౌరి । సదయము నీపాదసేవ సారసాక్ష విడను దేవ ॥మధు॥ వనమాలి వసుదేవా వరతనయా వనజనాభ । వినయముగను నీదుస్మరణ విడజాలను విశ్వేశా ॥మధు॥

వ॥ జనార్ధనా మాదాయాదులగు కౌరవులు మాపై కక్షబూని నానావిధ శ్రమలబెట్టి నాశముగావింప వలెనునని యెన్నియో కపట యుక్తుల బన్నుచుండిరి మమ్ముల రక్షించుటానికి నీదే భారము దేవా దివ్యప్రభావా.

నకులుడు ప్రవేశం - దర్వు

ద్వారకపురనిలయ శౌరి దామోదర కేశవహరి । నీ ర జా క్ష శ్రీమాధవ నీలవర్ణ బ్రోవరమ్మ ॥ద్వారక॥ దానవసంహార గోవర్ధనగిరి ధారీ మురహారి । మానసమున నిన్నెనమ్మిపూజ సేయుచుంటి దేవ ॥ద్వారక॥

వ॥ జనార్ధనా మాదాయాదులొనర్చిన మహాపరాధంబులకు తమ అంతఃకరుణవలన జీవించుచున్నారము దేవా మాయిడుములెల్ల దొలుగజేయుటానకు నీదే భారము.

సహదేవుడు ప్రవేశం – దరువు

నాదుసజ్జనపాలా సర్వేశ్వర సుగుణశీలా । రాధారుక్మిణీలోలా
రావానను బ్రోవవేరా ॥నాదు॥ గొప్పగు పెదకందుకూరి ముప్పిడిసారా
యణుడనే మెప్పగ దరిజేర్చెటి ఉపేంద్రహరీ కరుణించుమీ ॥నాదు॥

వ॥ జగధీశ్వరా యాకురువీరుడైన దుర్యోధనుండు బెట్టిన కడు యిడుముల నెన్నుటానకు శక్యంబుగాదు మాధవా మమ్మోద్ధరింప జేయుటానికి నీదేభారము దేవా దివ్యప్రభావా.

ధర్మరాజు తమ్ముల వీక్షించి

వ॥ భీమార్జున నకులసహదేవులార మన నాయిన్న పరసుపదవి జేరినందులకు మన భాగము దక్కించుకోనవలయునని దుర్యోధనుండొనర్చిన క్రూరకృత్యముల గాంచితిరా సహోదరులార యిదియునుగ గాక.

సీ॥ దార్తరాష్ట్రేంద్రుండు ధనమదాంధముచేత ♦ తనయులని నెంచక
తంత్రవాది ♦ దివ్యక్షేత్రములెల్ల తిరిగిరాండని చెప్పి ♦ మోసపుచ్చియు
యెంత గాసిజేసె ♦ మరుగుతోడను లక్కమందిరము నిర్మించి ♦ యోర్వ
జాలకను దుర్యోధనుండు ♦ నడియర్ధ నిసివేళ్ళ నగ్ని రగులగజేయ ♦
అడవిపాలయ్యితిమి ఆర్యవరమును॥ గీ॥ తమ్ములార వినుడిట్టి అధర్మ
పరులు ♦ యిలలో వైరులెకాని మిత్రులునుగారు ♦ కౌరవేయులు
బన్నెటి కపటములను ♦ యెన్నరాదిక హరిహరీ యెవరికైనా॥

భీము-వ॥ అన్నయ్యా వినుము అతాస్తి సత్తినాస్తి యనునట్లు దుర్యోధనుండు రాజ్యాపేక్షచే కపటభావంబుబన్ని మనల మడియజేయుటానకు యుపాయంబు లెన్నియో బన్నియుండెను. నేను నిద్రించి యుండ జూచి తాళ్ళచే బంధించి సముద్రములో బడవైచె. మేల్కాంచి దైవకృపచే పాశంబులన్ త్రెంచుకొని బ్రతికివచ్చితిని. అదియునుంగాక మరుగున విషపన్నము భుజింపజేసిరి విధికృపచే యాపక్వాన్నము జీర్ణంబై యావిషజ్వాలలు సోకక జీవించితిని. వాండ్ల కపటోపాయంబు లెన్నుటానికి వశమగునా అన్నయా యిట్టి క్రూర కృత్యములు గావించిన దుర్యోధనుని మధంబణం చెదను యుద్ధమునకు శెలవొసంగుము ధర్మనందనా.

ధర్మ-వ॥ వాయుతాత్మజ యింత తొందరపాటు జెందెదవేల శాంతి వహించి నిలుఁవుము.

అర్జు-వ॥ అగ్రజా యీ కౌరవాదులు జన్నిన కపటకార్యంబులు మీకు ఆనందంబుగా తోచుచుండెనా మనము యేవురము యేకీభవించి యుండగా మన ఆనందంబును గాంచి యోర్వజాలక తంత్రంబు లెన్నియో బన్ని తీర్థయాత్రలు సేవించి రాండని మరుగుపరచి లక్కాభవనమందు శయనింపక జేసి అర్థరాత్రివేళ్ళ అగ్నిముట్టించగా యీబీమన్న మేల్కాంచి మన యేవురుని హస్తలాఘువంబుచే అరణ్యంబునకుక్ దీసుకొని వెళ్ళెను. శ్రీభగవానుని పాదకృపవలన యీగండంబుదప్పెను. యిట్టి పాపకార్యంబు గావించిన పాలివారలను పంతగించి పటుశరంబులచే హతాహతంబు గావించెద అగ్రజా యుద్ధమునకు శలవొసంగుము.

ధర్మ-వ॥ అర్జునా ఆలసింపుము అట్టి అధర్ములను శ్రీహరియే హతంబొనర్చును శాంతి వహించి నిలువుము.

నకు-వ॥ అన్నయ్యా అన్నలు నుడివిన వాక్కులకు నామనసానందం బాయెను. మమ్మాశీర్వదించి పంపుము. యీపరువీరుల గోటమీటగలము.

ధర్మ-వ॥ సహోదరా వినుము శాంతమే సర్వసౌఖ్యము లనుభవింప జేయును ఆలసింపుము.

సహ-వ॥ అన్నయ్యా మనము పెంపుడు కోడుకుల విధముగా యీ దుర్యోధనుండు మనకు దరిదాపు లేకుండునట్లు జేసె. కిరాత కార్యములు నీకు న్యాయమని తోచుచుండెనా మదించియున్న దుర్యోధనుని బట్టి భూదేవికి బలిగా నొసంగుదము. తడవుజేయక యుద్ధమునకు శల వొసంగుము జనువారము.

ధర్మ-వ॥ సహదేవా నావాక్కు నమ్మి నిలువుము

తమ్ములతో వాదం - రెండుతీర్ల పాటి

ధర్మ॥ అనుజులార మీరలిపుడు ఆలమునకు బూనవలదు । వినయముగను వివరించితి వినుడినాదు వాక్కులిపుడు ॥అను॥

భీము॥ జనవర యివ్వాడు జాగుసేయకను । చయ్యనమాకును శలవు నొసంగుమి । అనుమానించక ఆ కౌరవులను । హతమొనర్చెదము అగ్రజ నేడును ॥జన॥

ధర్మ॥ భీమసేన నీవు యిప్పుడు బిరుదు వహించియు వేగమె । తామసంబు నొందవలదు తాళుము తగువుకు వలదూ ॥భీమ॥

అర్జు॥ ప్రేమాకరమన గ్రామము విడియిట । బిక్షమెత్తి భుజియించుట యేలను । పామరులగు యీపాలి వారలను । పట్టివధించెద పరగ శలవు నిడు ॥ప్రేమా॥

ధర్మ॥ అనుజ అర్జునా నిలువుము ఆలసించుమనివలదు । మనమున నావాక్యము నమ్మి మానుకొనుము మహారణము ॥అను॥

నకు॥ తనవారలు యనిదలచక వారలు । తంత్రవాక్యాలచె దయ మదిలేకను । మన మరణము కాసించిన వానిని । మర్ధనజేసెద మాకుశలవు నిడు ॥తన॥

ధర్మ॥ సోదర నావాక్యమునమ్మి వాదుమాని యుండుమికను పాదుగ యిలలోన మనప్రారబ్ధము యెటులున్నదో ॥సోదర॥

సహ॥ పాదుగ కౌరవ పందల ద్రుంచియు । బాధలు దొలగింతుము శలవివ్వుడి । మోదముగను ముప్పిడి నారాయణు । ఆదరించె శ్రీహరియే గలడిక ॥పాదుగ॥

ధర్మ—వ॥ సహోదరులార శాంతమే-సర్వ సౌఖ్యమని శృతులు బోధించుచున్నవి కావున నావాక్యములు నమ్మి లసించుడు.

భీము—వ॥ అగ్రజా మీయాజ్ఞ శిరసావహించి ఆవిధమే మెలగువారము.

ధర్మ—వ॥ అనుజులార భోజనవేళ్ళ సమీపించినది స్నానసంధ్యానుష్టానము దీర్చుకొని భిక్షాటనకు వెళ్ళెదాము రాండు యికనే జనుచున్నాడా.

భీము—వ॥ అన్నయ్యా మేము నల్వురము నాల్గు దిశలకుజని శాకపాకంబులు సమకూర్చుకొని రాగలము.

## ధర్మరాజు - భిక్షకు వెడలుట - దర్వు

దేవాదేవకి కుమార బ్రోవరావ భోగిశయన । భావజ జనకా మాదుబాధలు దొలగించుమయ్యా ॥దేవా॥ వెడలెద విప్రులవాడకు వేగ అన్న భిక్షముకై । తడయక చేకొనియు నామతల్లిసన్నిధికి జనియెదా జైభగవత్ భిక్షాందేహి ॥

## భీముడు వెడలుట - దర్వు

దీనదయాకర శౌరి దిక్కు నీవె మమ్ముగావగ । గానలోలనీదు పాద కమల సేవ విడను దేవా ॥దీన॥ భూసుర భవనముల కిపుడు భుక్తముకై భిక్షకోనగ । వాసిగనే వెడలుచుంటి వాసుదేవ బ్రోవుమయ్యా ॥జై భగవత్ భిక్షాందేహి ॥

## అర్జునుడు వెడలుట - దర్వు

నీలవర్ణ సాదుహృదయలోలశౌరి శ్రీ మాధవ । చాలగనిను వేడు చుంటి బాలక్రిష్ణ లోకేశ్వర ॥ నీల ॥ ఆపత్ బాంధవ శౌరీ అరుసువాడ అన్నముకై । కాపాడగరమ్మ దేవకరుణాకర వాసుదేవ ॥జై భగవత్ భిక్షాందేహి॥

## నకులుడు వెడలుట - దర్వు

బాలక్రిష్ణ వాసుదేవ భవవినాశ బ్రోవరావ । జాలమేల జేసెవు వనమాలిధర మహాప్రభావా ॥బాల॥ యేకచక్రపురములోన శాకపాక భిక్షముకై । ప్రాకటముగ జనుచుంటిని వ్యాకులమీడేర్చు స్వామి ॥జై భగవత్ భిక్షాందేహి ॥

## సహదేవుడు వెడలుట - దర్వు

మురళీధర హే ముకుంద మొరాలించి బ్రోవు క్రిష్ణ । గిరిధారి దరి జేర్చుమి పరమపావన మురహారి ॥మ.ర॥ నందనందనా భవహార బృందావన సంచారా । పొందుగ పెదకందుకూరి పురవరము దరిజేర్చుమీ ॥జై భగవత్ భిక్షాందేహి ॥

సం-వ॥ యిట్లు పంచపాండవులు భూసుర భవనంబులన్ దిరుగుచు భిక్షాటన జేయుచుండగా

## కుంతీదేవి ప్రవేశం – దర్వు

వాసుదేవా । నేడోసిలోగ్గియుంటిని నామొరవినుము ॥వాసు॥ శ్రీశుభాకర సింధుశయన హరి । దోషనాశ సర్వేశ జనార్దన ॥వాసు॥ గోపబాలా ।హేగోవర్ధనధర గోపీపాలక ॥గోపా॥ పాపహారణ నీప్రార్థన మరువను । కాపాడుము నను కరివరదా హరి ॥వాసు॥ సుందరాంగ । గోవింద సనకసనందన పూజ్యా ॥సుంద॥ పొందుగాను పెదకందుకూరు శ్రీ । నందనందనా నను కృపగనుమా ॥వాసు॥

వ॥ దేవా లోకేశ్వర నాప్రాణనాథుండు పరమ పదవి జేరిన నాట నుండి కౌరవులు మాయోపాయంబులన్ బన్ని మమ్ముల అడవి పాలు గావింపగ కడుయిడుముల నొందుచు యీ యేకచక్రపురంబున ప్రవేశించి యిచ్చట భూసుర వేషంబులతో భిక్షాటన జేయుచు కాలంబు గడుపవలసి వచ్చెను. క్రిష్ణా మాబాధలు దొలగించుటకు నీదే భారము.

కుంతి-వ॥ ఆహా నాసుకుమారులు భిక్షాటనకుజని యింకా రాక పోయిరి నిచ్చట యెదిరి చూచుచు నివసించెదగాక.

సీ॥ క్షితిలో నా సుకుమారులతిశ్రమల నొందుచు ♦ భిక్షమెత్తగ వలసె బిడియపడక ♦ పతివరంబున పరమపదవి జేరుట చె యా ♦ కౌరవులు మాపైన కక్షబూని ♦ వేయువిధంబులా వెతలనుబెట్టియు ♦ పాయనికష్ట ముల పాలుజేయ ♦ సుతులను వెంటగొని అతిథుల విధముగా ♦ దిరుగ నాయెను యిపుడు ధరణిలోన గీ॥ హితవులేకను గాంధారి సుతుడు మమ్ము ♦ హతముజేయదలంచగా అడవిజేరి ♦ బ్రతికితిమి అర్వారము బహుబాధజెంది ♦ పతితపావన యికనీవె గతియు మాకు ॥

సం-వ॥ యిట్లు విలపించుచుండగా

## ధర్మరాజు భిక్షచేకొని – అనుట

సీ॥ ధరణిపాలకుమై ధర్మరాజనియును ♦ పేరువడసియు నిరుపేద నయ్యి ♦ విధికృప దప్పియు విప్రుల గృహమున ♦ భిక్షమెత్తగ వలసె బిడుదు

మాని ♦ పూర్వకర్మమువలన సర్వవ్యాపకుడిట్లు ♦ జేసెనో తెలియదు జన్మఫలము ♦ విధివ్రాలుకిప్పుడూ మదిచింత జేసినా ♦ ఫలమేమి గలుగునూ సలలితముగ॥ గీ॥ జనకుడును పరమపదవికి జనుటయిట్లు ♦ జనని మమ్ముల వెంటగొని జగతియందు ♦ దిమ్మరులవలెను భిక్షకై దిరుగవలసె ♦ రక్షణయు జేయు మము జగద్రక్ష కృష్ణా॥

వ॥ సరెసరె యిప్పుడు శ్రీభగవానుని పాదకృపవలన భిక్ష చేకొంటినిగాని జనని సన్నిధికి జనువాడను.

## భీముని వాక్యం

సీ॥ ధాత్రిలోనను మేము క్షత్రియ వంశమున ♦ జన్మించగను మాదు జయముగాంచి ♦ యోర్వజాలకను దుర్యోధనుడు మాపైన ♦ యెన్నియో కపటముల్ బన్నియుండి ♦ కక్కస మొంచియు లక్క మందిరముకు ♦ అగ్ని ముట్టించగా నపుడె వెడలి ♦ లోకేశ్వరుని కృపచే యేకచక్రపురంబు జేరితిమి ఆర్వురము జయప్రదముగ॥ గీ॥ కపట హీనులగు మాపాలి కౌరవులను ♦ పట్టి దృంచుదుగాని యీ పట్లనాకు ♦ ఆలమును శలవు యీవడాయె నగ్రజుండు ♦ బాధలనుబాపి బ్రోవు గోపాలబాల॥

వ॥ ఆహా సరెసరె యిప్పుడు శాకపాకంబులు సమకూర్చితిని యిక మా జనని సన్నిధికి జనువాడను.

## అర్జునుని వాక్యం

సీ॥ కౌరవులకు మాకు కాంక్షతో ద్రోణుండు ♦ అస్త్రవిద్యయు నేర్ప అపుడుగాంచి ♦ బాణవిద్యలకెల్ల పార్థుడె మిన్నయని ♦ సకల జనులును సంతసమునునొంద ♦ యోర్వజాలకను దుర్యోధనుడు మమ్ముల ♦ వెతలబెట్టుచునుండె వేయివిధుల ♦ అట్టి కురుపందలా హతమొనర్చెద నన్న ♦ అన్న మా వలదని ఆపుచుండె॥ గీ॥ రాజులమయ్యు జన్మించి రాజ్యమిడచి ♦ అక్షపాత్రి చేకొని భిక్ష మగుడుగవలసె ♦ యిట్టి కష్టంబులును మేము యెన్నడైన ♦ యెరుగలేము శ్రీకృష్ణ మము యేలుకొనుమా॥

వ॥ ఆహా నేనిప్పుడు పక్వాన్నము సమకూర్చితిని గాని యిక మా జనని సన్నిధికి జనువాడను.

నకులుని వాక్యం

కం॥ యెన్ని దినంబులు యీవిధి
అన్నముకై భిక్షమనుచు ♦ అడుగవలయునో
యెన్నడు నీకృప గలుగునో
కన్నడసేయకను బ్రోవు ♦ కరివరదహరీ॥

వ॥ నేనింతలో భిక్ష సమకూర్చుకొంటినిగాని యిక మా జనని సన్నిధికి నేగువాడను.

సహదేవుని వాక్యం

కం॥ దేవాదిదేవ శ్రీహరి
రావా మముబ్రోచుటకును ♦ రాధాలోలా
భావజ జనకా నిను నా
భావములో మరువకుంటి ♦ భవభయదూరా ॥

వ॥ ఆహా నేను విప్రగృహంబులలో శాకపాకములు సమకూర్చు కొంటిని గాని యిక మాజనని సముఖమునకు జనువాడ.

సం-వ॥ యిట్లు యేవురు పాండవులు భిక్షజేసుకొని కుంతిదేవి సన్నిధి కరుదెంచి అనుట

తల్లి కొడుకుల వాదం - చెత్తి

ధర్మ॥ జననీ నిదుగో । నే జనియు అన్న భిక్షముగొని వస్తిని ॥ జననీ॥ వినయముగను నీవిప్పుడు చేకొని । అనుజులు దెచ్చేటి అన్నము గైకొని । మనమార్వురము మహాప్రసాద మీ । దినమున తృప్తిగ తిని యుందామిక ॥జననీ॥

కుంతి॥ తనయాచాలా । నా మనమున సమ్మోదమాయెను గానీ ॥ తనయా వినరా ॥ జనకుడులేనీ తనయులకెప్పుడు । జగతియందునా జయ

మునులేదూ । అనుదినమును మనమూర్ద్వరమూను । కనకాంబరుసీ వినుతించుదమిక ॥తనయూ వినరా॥

భీమ॥ తల్లీనేనూ । యీపల్లెదిరిగి పక్వాన్నము దెస్తిని ॥తల్లీ॥ మెల్లెగాను నేమెక్కియు నచ్చుట । మిగిలిన బోనంబిదో గొనివస్తిని । యుల్లమునను రంజిల్లబోకు నా । నల్ల నేరమని వాదించకుమిట ॥తల్లీ॥

కుంతి॥ చల్లాగాను । వర్ధిల్లుము నీవూ వాయుతాత్మజా ॥చల్లా॥ నల్లనయ్య నీనామము విన్నను । యెల్లజనులు భీతిల్లుచు నుందురు । మల్లుల గెలచెటి మహాబలశూరా । మనసానందంబాయె కొమారా ॥చల్లా॥

అర్జు॥ మాతా నేనూ । శ్రీమదుసూదను నీమదిలోనమ్మియు॥మా॥ ఖ్యాతిగ నేజని కాయగూరలును। ప్రీతితో జేసిన పిండివంటలును । హేతువ మీరగ యివి సమకూర్చియు । నేతిలాడువలునే గొనివస్తిని ॥మాతా॥

కుంతి॥ దాతా మనకూ । యీరీతిగ యానని వ్రాతవ్రాసెనో ॥దాతా॥ శ్వేతవాహన శ్రేయముగానూ । నీతికొరకు ప్రఖ్యాతి వదలియు। భూతలమునను బోనమడుగుచూ । ఖ్యాతిగ కాలము గడువగ వలసెను.

నకు॥ కన్నాతల్లి । నేతిన్నగ జనియును తీర్థప్రసాదము ॥కన్నా॥ అన్నలతోనూ అరగియునేనిక । అమ్మయనుచు భిక్షడగియు దెస్తిని । పన్నుగ చేకొను పాయసమును మీ । పాదంబులనే ప్రస్తుతించెదను ॥కన్నా॥

కుంతి॥ చిన్నీ పుత్రా । నీ మన్ననకును నే మదిముదమొందితి ॥చిన్నీ॥ యెన్నికమీరగ యేకాంతంబున । యేవురుమీరలు యేకముగాను । పన్నుగాను యీ పక్వాన్నంబులు । అన్నియు యిప్పుడు ఆరగించుడీ ॥చిన్నీ॥

సహా॥ అమ్మా నేనూ । నగరమ్మందిరిగి బోనమ్మదెస్తిని ॥అమ్మా॥ కమ్మని శాకము గారెలు పోలెలు । నిమ్మపచ్చడయు నిత్యముగానూ । సమ్మదమున యివి సమకూర్చుకొని । సరగున నీ సరసకు వస్తిని విను॥ అమ్మా॥

కుంతి॥ నెమ్మానమునా । బలుసమ్మదమాయెను సహదేవా యిక॥ నెమ్మా॥ యిమ్మహిలో పెదకందుకూరు పు । రమ్మున ముప్పిడి నారాయణకు । సమ్మతిగను యిలసౌఖ్యము లొసగెటి । సారసాక్షుని స్మరియించుదమిక ॥నెమ్మా॥

వ॥ ధర్మజ భీమార్జున నకుల సహదేవులార మీరలు యేవురు యిచ్చట నివసించండి యీ పక్వాన్నము భుజంచెదము.

ధర్మ-వ॥ జననీ శ్రీహరిని ధ్యానించుచు భుజించెదము.

ద రువు

శ్రీపతి మను ద్రోపదావ శ్రితజన పోషణదేవా । యేప్రొద్దునీదు స్మరణ యేమారము దేవదేవ ॥శ్రీపతి॥ ద్వారకపురనిలయ శ్రీశనారాయణ దాసపోష । చేరమెన్నకను కృపచే నీరజాక్ష పాలించుమి ॥శ్రీపతి॥

సం-వ॥ యిట్లు తదేక నిష్టచే పాండవులు శ్రీకృష్ణ పరంధాముని గొనియాడుచు నివసించి యున్నంతలో.

జ్ఞానంభట్లు ప్రవేశం – దరువు

వేదశాస్త్రములు విరివిగ దెలిపెటి । విప్రుడ జ్ఞానంభట్లనురా । యీ ధరణిలో మానిలయము నెప్పుడు యేకచక్రపురమును వినరా ॥వేద॥ దేశాటనమును జేయుటకొరకు యీ సమయంబున వెడలితిరా । భాసురముగ పెదకందుకూరు నివాసుని మదిలో దలచెదరా ॥వేద॥

వ॥ సేవకా నేను యెల్లప్పుడు దేశాటన జేయుచు దేశాధీశులకును వేదశాస్త్ర పురాణములు దెల్పి వారలచే బహుమతులను బొందుచుండెటి నా నామము జ్ఞానంభట్లని గొనియాడెదరు కావున నేనిప్పుడు శ్రీహరిని ధ్యానించుచు దేశ సంచారముకై పెడలెదగాక.

దరువు – చెల్లి

గానలోల శౌరి క్రిష్ణ । దీనుని మొరవినుమా క్రిష్ణ । దానవహారనీ దరిశనమునకై । పూని వేడెదము భోగిశయన హరి అందముగను నిన్నూ । నామది । యందున దలచెదరా క్రిష్ణా । పొందుగాను పెదకందుకూరిగో । వింద జనార్ధన యిందు రమ్మికా ॥గాన॥

త న లో

వ॥ ఆహా నేనిప్పుడు పాంచాల పురంబు జేరవచ్చితిని యిక్కడ ద్రుపద మహారాజు సభామంటపము అలంకరించాడు యెందులకో కనుగొనెదగాక.

దృపదుడు గాంచి అనుట

వ॥ భూసురేంద్రి వందనములాచరించువాడ యిచ్చట నివసించుడు.
భూసు-వ॥ నరవర చల్లగవర్ధిల్లుము కాని నొక్క విచారణ.

జ్ఞానంభట్లకు దృపదునకు - వాదం

జ్ఞాన॥ ప్రిభువుగారు యిపుడూ మీారే । శుభకార్యము జేయూ దలచీ । సభనిర్ణయముకు చక్కపరచినరో । సవినయముగ యూసంగతి దెల్పుమి ॥ప్రిభు॥

దృప॥ విభవమొప్పగానూ ధరణీ । ప్రిభులు ఇటకు వచ్చేదారు । వుభయుల కొరకను పుత్సాహాముచే । శుభకార్యమునకు శృంగారించితి॥ విభవ॥

జ్ఞాన॥ భూప యెందుకొరకూ యిటకూ । భూపతులొచ్చేదరూ యిప్పుడు । యేపనికై యిక యేగుదెంచెదరో । పాిపుగ దెల్పుడి పద్ధతి యేదొకా ॥భూప॥

దృప॥ దాిపతి స్వయంవరమూ జేయగ । ధరణీశుల కిపుడూ లేఖలు । యేపుగాను బంపించి యుంటినిక । యీా పట్టణముకు యేగుదెంచెదరు ॥దాిపతి॥

జ్ఞాన॥ సరెసరె నామదికీ యిప్పుడు । సంతోషంబాయె జనవర । సరిగనున్న యీా స్తంభమెందులకొ । అరమర లేకను అదియును దెల్పుడి॥ సరెసరె॥

దృప॥ మరుగెరగించెదనూ వినుమీా । మత్స్యయంత్రిమూాను నిలపితి । ధరణలో యీా యంత్రిము యెవరైనను । శరముచెగొట్టియు బిరుదు బూానవలె ॥మరు॥

జ్ఞాన॥ గురిగాంచియు శరమూా వైచియు । ధరపై యిది బడగా గూల్చిన । నరునకేమి కట్నము నొసంగెదరో । సరగునవినుపుడి సంశయ పడకను ॥గురి॥

దృప॥ వరసుత ద్రౌపతీసీ వారికి । పరిణయ మొనరింతు భూసుర । ధరణి కందుకురు ధాముననమ్మియు । పరగనేను యీా ప్రితిన బూనితిని ॥ వరసుత॥

వ॥ భూసురేంద్ర వినుము యీ మత్స్యయంత్రము తెగగొట్టిన వారికి నాసుకుమారియగు ద్రౌపదిని నొసంగెదనని ప్రతిజ్ఞ బూని స్వయంవరము ప్రయత్నంబు జేయుచుంటిని,

విప్ర-వ॥ సరెసరె మహా సంతోషము సంతోషము మాబోటి బ్రాహ్మలకు ముద్దపప్పు నెయ్యి లాడు పేడా దొరికె సుదినంబు వచ్చెను యిక మాపురంబునకుబో జనెదగాక,

చెలి

రాధేక్రిష్ణ గోపాల క్రిష్ణా॥ (యింతలో)

సుజ్ఞానంభట్లు ప్రవేశం - దర్వు

సోమశేఖరుని నామది దలచెటి । సుజ్ఞానంభట్లను వినరా । గ్రామ గ్రామ సంచారము జేయుచు నీమనిష్టలుచు సలిపెదరా ॥సోమ॥ యేకచక్రపుర లోకులు నన్నూ । యెన్నికతో గొనియాడెదరురా । ప్రాకటముగ పెదకందుకూరు శ్రీ । పరమపావనుని మరువనురా ॥సోమ॥

వ॥ సేవకా నేను యీ యేకచక్రపురంబున పౌరోహితము జేయుచుండెటి వాడను. నా నామము సుజ్ఞానంభట్లుయని గొనియాడెదరు.

సం-వ॥ యిట్లు దెలిపి జ్ఞానంభట్ల రాకగాంచి అనుట.

(తనలో)

వ॥ వోహొ యీ జ్ఞానంభట్లు సంచారముకై జను తొందరగనే విచ్చేయుచున్నాడు యేగ్రామంబున యేశుభకార్యములు జరుగుచున్నవో విచారించెదగాక,

సుజ్ఞానంభట్లకు - జ్ఞానంభట్లకు - వాదం

సుజ్ఞా॥ జ్ఞానంభట్లూ - యేగ్రామమునుజని శీఘ్రముగ వస్తివి ॥జ్ఞానం॥ మానసమున అనుమానము లేకను । పూని వినుపు పరపురముల విషయము ॥జ్ఞానం॥

జ్ఞానం॥ క్షోణీ ద్రుపదా । వరసుపుత్రి ద్రౌపతి శుభలగ్నముకై ॥ క్షోణీ॥ మానవేంద్రుడును మత్స్య యంత్రమును । పూనినిల్ప గని నేనిటు వస్తిని ॥క్షోణీ॥

సుజ్ఞా॥ మోదామాయే । యిక పోదము పద యాపురము జేర
గను ॥మోదా॥ పాదుగాను యాప్రభువు మనకును । లేవనకను జలిచ్చు
కట్నములు ॥మోదా॥

జ్ఞానం॥ పాదూగాను । మన పౌరోహితులతో ప్రయాణమయ్యా॥
పాదూ॥ యీదినమును మన మిచ్చట గూడియు । మోదముగను యిక
పోద మందరము ॥పాదూ॥

సుజ్ఞా॥ వేడూకాతో । మనవాడలెల్లనూ వరుసగ దిరిగియు ॥ వే ॥
జాడదెల్పి యటకూడగ జేసియు । తోడుగవారల దోలుకవచ్చెద ॥వేడూ॥

జానం॥ నేడూ మనమూ । జతగూడి పోదమిక కోర్కెదీరగను ॥నే॥
లేదు మనకునూ లాడు భక్షములు । జోడుగ బెట్టును యాడదొరుక విక ॥

సుజ్ఞా॥ తోందరాగా । పురమంతదిరిగి బ్రాహ్మలకు నిప్పుడూ ॥తోం॥
అందరికిని యిదియంత దెలిపియు । ముందుగ వచ్చెద యిందుజేరగను ॥

జ్ఞానం॥ ముందూగానూ । యా ముప్పిడి నారాయణను బొ్రిచెటి॥
ముం॥ అందమైన పెదకందుకూరి గో । విందుని నామదియందు దలచెదను॥

వ॥ సుజ్ఞానీ నీవు వేగిరను గాజని భూసురుల కందరికి దెల్పి ప్రయా
ణము జేయుము నే గృహంబునకు జనుచున్నానూ.

సం-వ॥ యిట్లుదెల్పి జానంభట్లు భవనంబునకుజని అచ్చట నివా
సమైయున్న పాండవులగాంచి అనుట.

వ॥ పౌరోహితులారా నొక్క విచారణ దెలిపెద వినుడు.

ధర్మ-వ॥ భూసుర యావిచారణ యెద్దియో విన్నవించుము.

## ధర్మరాజుకు జ్ఞానంభట్లుకు - వాదం

జ్ఞాన॥ పౌరూలార । నేపాంచాలపుర ప్రభు సన్నిధికి ॥పౌరూ॥ వూరు
విప్రులము వుత్సాహముతో । జేరబోయెదము మీరేమనియెదరు ॥పౌరూ॥

ధర్మ॥ మీరూ యిపుడూ । యే కారణమునకై జేరుచుంటిరి॥
మీరూ॥ వేరులేక యావిధమును వినుపుమి । కూరిమిమీరగ గూడిపోవు
దము ॥మీరూ॥

జ్ఞాన॥ ఘనపాలుంగా । వరపుత్రిక లగ్నము బూనుకొనియునూ ॥
భూపా॥ ప్రోపుగ నిల్పెను మత్స్యయంత్రమును । రేపు స్వయంవర మేపుగ జరుగును ॥భూపా॥

ధర్మ॥ ఆపూరికి । మేమటులైతె వచ్చెదము ఆర్వారమూను ॥ఆపూ॥
సాపాటుకు సంశయము లేదు యిక । తీపి పాకములు దెచ్చిపెట్టెదరు ॥ఆపూ॥

జ్ఞాన॥ వేసూలేకా । పురవిప్రులతోనూ వెసలుదమిప్పుడు ॥వేసూ॥
కూరిమిమీరగ మాకు ఆర్వారును । జేరరాండి యీదారిలో నిలచెద॥ వేసూ॥

ధర్మ॥ ధారుణీశూ । యీ నారాయణునేల్ నీరజాక్షునీ ॥ధారూ॥
సారెసారెకును స్మరణ జేయుచును భూరివేడ్కచే జేరవచ్చెదము ॥ధారూ॥

సం-న॥ యిట్లు దెల్పి ధర్మరాజు సహోదరుల వీక్షించి అనుట
తమ్ములార యిటు రాండు.

## ఆర్వారి - వాదం

ధర్మ॥ అనుజలార మీరూవినుడూ । అతిరహస్యమొకటి నిప్పుడు ।
వినయముగను మీ వీనుల కింపుగ । విన దెలిపెదనూ విశదముగాయిక ॥అ॥

భీమ॥ అనుదినమును నీదూ వాక్యమును । మనమునందు నమ్మి యుంటిమి । మనుజేశ్వర నీమదిగల కోరిక । వినగదెల్పు యీ విధమెయ్యెదో కా ॥అను॥

ధర్మ॥ భూవీరుండైనా ద్రుపదుడు । పుత్రిక లగ్నమునూజేయగ ।
సావధానముగ స్వయంవరంబును । కేవలముగనూ తావహించెనట ॥భూ॥

అర్జు॥ యేవిధంబునైనా అగ్రజ । యేగవలయు నిపుడూ నచటికి ।
భూవరునీ వరపుత్రి స్వయంవర । మీ వేళ్ళనుగన భావము గుదిరెను ॥యే॥

ధర్మ॥ సావధానముగనూ మనము । సవ్యసాచి వేగా జనుదము ।
యీ వేళ్ళను యీ యేచక్రపుర । మావల విప్రులు మనకై నిలచిరి ॥సా॥

నకు॥ భూవర మనమిపుడూ వేగమె । పోవుద మార్వారమూ గలసియు । నీవు నుడివినా నేర్పరంగుచును । యేవేళ్ళను చరియించు చుంటిమిక ॥భూవర॥

ధర్మ॥ ద్రౌపది స్వయంవరమూ గాంచగ । ధరణీసుని సభకూ నేడును । యీపురమునగల బాపన వారల । దాపుజేసుకొని దనరగ జను దము ॥ద్రౌపది॥

సహ॥ యేపగిదిగనైనా మనమూ । యీస్వయంవరమునకూ అన్నయ । యేపుగ మది సంతాపము లేకను । యీపట్లనుయిక యేగుద మటుపదు ॥యేపగి॥

ధర్మ॥ అంతమెుదగానూ మదియుద । మెుందుచు మనమిపుడూ యింతలో । నందనందనుని నమ్మికొనియు । పుర । మందబోవుదము అను జులార యిక ॥నంద॥

కుం॥ సుందర సోమగమూ గలిగిన । సూనులారపముడూ పోదము॥ కందుకూరు పురమందు వెలసినా । శింధుశయను మదియందు దలంచుచు ।

వ॥ తనయులార యా ద్రౌ ప ది స్వయంవరము గాంచుదాము పదుడు.

సం-వ॥ యిట్లు అర్జురు యేకీభవించి హ రి ని గొనియాడుచు పాంచాల దేశంబునకుర్ర వెడలుట.

దర్వు - చౌత్రి

దేవారావా । హే దీన దయాకర దీనుల బ్రోవగ ॥దేవా॥ భావ ములో నీపాద సేవయును । యేవేళ్ళను విడలేము జనార్ధనా ॥దేవా॥ నీరా జాక్షా । మా నేరమెన్నకను చేరిబ్రోవుమిూ ॥నీరా॥ ధారుణి పెదకందు కూరి ముప్పిడి । నారాయణునేల్ నగధర మాధవ ॥దేవా॥

వ॥ భూసురులార రాండురాండు ద్రౌపతి స్వయంవరము గాంచు టకు జనుదాము.

సం-వ॥ యిట్లు జనుచున్నంతలో.

గంధర్వుడు ప్రవేశం - దర్వు

గానలోలునీ ధ్యాన్నము జేసెటి । గంధర్వుండనునే వినరా । క్షోణి లోన భుజబలము గలిగినా । శూరుడ రణజయ వీరుడరా ॥గాన॥ పొం దుగ పెదకందూ్కరులో వెలసిన నందకొమారుని మరువనురా । అందము గనునా అతివను వెనుగొని పొందుగ కొలనుకు జేరెదరా ॥గాన॥

వ॥ సచివా నామనంబున యెల్లప్పుడు సర్వేశుని ధ్యానించుచుం డెటి గంధర్వుండని గొనియాడెదసు కావున నా మనోహరిని దోలుకొని స్నానసంధ్యల దీర్చుకొనుటకై కొలనుకు నేగెదగాకా.

కుంభీనసి ప్రవేశం – దర్వు

నాథుని సేవలో సదయము నుండెటి । నామము కుంభీనసి నమ్మా ।
మోదముగను చరియించుచు నుండెటి ముదితరో గంధర్వుల మమ్మా ॥
నాథుని॥ క్షితిలోనను పెదకందుకూరి శ్రీ । పతిత పావనుని మదిదలచీ ।
అతివలతో గుమిగూడియునాడు । పతిసన్నిధికిని జనియెదనూ ॥నాథుని॥

వ॥ సఖియా నేను గంధర్వుని సతినై కుంభీనసియని పేరువడసి యుంటిని యింతలో నానాథుని సన్నిధికి యేగెదగాకా.

చ త్రి

రాధేకృష్ణ గోపాలకృష్ణా ॥

సతి–వ॥ నాథా వందనము లాచరించుచానా.

పతి–వ॥ సఖీ చల్లగా వర్ధిల్లుము.

సతిపతుల – వాదం

పతి॥ కలికీ వినుమా । యీ కాననమందున కడు సుందరమా ॥
కలికీ॥ కొలను కేళియును కోర్కె దీరగను । జలక్రీడల నాటలు నాడుద మిక ॥కలికీ॥

సతి॥ సలలితముగా । బలు సంతసంబునా సరగున జనియును ॥సల॥
పలువిధంబులను జలక్రీడలనూ । సలుపుదమిక పదుకొలను సన్నిధికి ॥సల॥

పతి॥ నారీమనమూ । యిక యీరాత్రియె ఆట కేగియు యిప్పుడు॥
నారి॥ కూరిమి మీరగ గూడి యాడుకొని । వేరులేక నిటు వేంచేయుద మిక ॥నారీ॥

సతి॥ శూరావీరా । యీ సోమాశ్రమమున సొంపగు కొలనుకు ॥
శూరా॥ ధారుణి పెదకందుకూరి నివాసుని । సారెకు దలచుచు సరగున జనుదము ॥శూరా॥

పతి-వ॥ సరియె యీ సోమాశ్రమమునగల సరోవరముకు జను దామురమ్మా.

సం-వ॥ యిట్లు యిరువురు జలక్రీడ లాడుటకై కొలనువద్దికి నేగి నంతలో, పాండవులు హరిని ధ్యానించుచు ద్రౌపది స్వయంవరము గాంచగ వచ్చుట.

దర్వు

వాసుదేవ నీధ్యాసమరువకను। దోసిలొగ్గియుంటిమి కరుణాకర। దాసుల పాలిటి దైవము నీవని। దలచుచుంటి మయ్యా శుభకర ॥వాసు॥

సం-వ॥ యిట్లు వచ్చుచున్న పాండవుల గంధర్వుడుగాంచి అనుట.

( తనలో )

వ॥ ఆహా యీ నడిరేయి నరాధముల ధ్వని వినబడుచున్నది యిటకు వచ్చినచో మా జలక్రీడలు భంగంబౌను కావున కడుదూరంబు వెళ్ళదోలెద గాక.

పాండవులకు - గంధర్వునికి - వాదం

గంధ॥ మనుజాధములారా మీరూ। మరుగు దెలియకానూ యిచటికి। అనుమానించక అర్ధరాత్రి యీ వనముకు వచ్చుట వలదిక పొండీ ॥మను॥

ధర్మ॥ అనుమానముదోచే మదికీ। అట్టి విషయమూనూ యెట్టిదో। వినయముగను నీవివరమేదోకా। వినదెల్పుము యిక విశదముగానూ ॥అను॥

గంధ॥ గంధర్వులు దిరిగే స్థలమిది। గనుగొనుడీ మీరూ యిప్పుడు। యిందుంటెను మీ యేపణం చెదను। తొందరగను యిక దూరము జనుడీ ॥గంధ॥

భీమ॥ మందబుద్ధివాడా మమ్ముల। మరలించెదవౌరా నీవూ। ముందు వెనుక గనకిందు పలికెదవు। గంధర్వుడ నీ గతియు దెలుసుకో॥

గంధ॥ నాదు పరాక్రమమూ దెలియక। వాదుజేసెదారా వారీ। పాదు,గాను నాపటుశరంబునూ। ఛేదించియు మీశిరములుదరిగెద ॥నాదు॥

అర్జు॥ నీదు మదంబణచీ మేమూ। నింతలో జనెదమురా వారీ। క్రోధము హెచ్చెను కోలహాలముచె। పాదుగ నిన్నిటు పట్టివధించెద ॥

గంధ॥ అధమాధమ నీవూ చాలా । వొదరెదవేలనురా వారీ । వ్యర్థవ నిన్ను యీ పదను శరంబుచె । వధగావించెద వరే నిలువరా ॥అధ॥

నరు॥ మదహంకారముచే బల్కేవు। మచ్చర మణచెదరా క్రూర । కమల నివ్వాకను కరవాలముచే। కుదురుగనిన్నిట గూల్చెద చూడర ॥మద॥

గంధ॥ నిక్కముగను వినరా మిమ్ముల। నేలగూల్చెదనురా వారీ। యిక్కడ నిల్వక యెక్కడికేగిన । దక్కనివ్వకను ధగ్ధముజేసెద ॥నిక్క॥

నరు॥ చిక్కితి వికరారా నిన్ను । నృక్కణగించెదరా చోరా । మక్కువతో పెదకందుకూరు శ్రీ । మాధవు దలచియు మడయజేసెదను ॥ చిక్కితి॥

## అర్జునునికి గంధర్వునికి - వాదం

అర్జు॥ వరే నీవు మావడి బలమెరుగక । వచ్చితివిక నిలునిలుమిరా। సరిగనిన్ను యీ సంగరమందున । సంహరించెదను గనుగొనరా ॥వరే॥

గంధ॥ నరాధమా నాపరాక్రి మెరుగక । నన్ను చులుకనెంచెద వారా । బిరాన యీకర శరంబుచేసీ । బిరుదుమాపెదను నిలువుమిరా ॥ నరా॥

అర్జు॥ క్రూరనిన్ను నావీరత్వముచే । కూలజేయకను విడువనురా । ధీరమీర శరధారలు గురిపియు । ధారుణిపై బడవైచెదరా ॥క్రూర॥

గంధ॥ ధారుణి పెదకందుకూరు మిప్పిడి । నారాయణుసేల్ శ్రీహరినీ । సారెకునామది కోరిభజించుచు । పోరున నిను వధియించెదరా॥ధారు॥

## గంధర్వుని - వృత్తము

మనుజాధమ నీ మదవణగించెద । ఘనగర్వంబును గ్రక్కున దీసెద । కనుగొనరా నిను ఖండన జేసెద । రణమున బట్టియు రయమొనరించెదా ॥మను॥

## అర్జునుని - వృత్తము

వరె గంధర్వుడ వచ్చేరబాణం । దురమున నిన్నిక దునుమక విడువను । పరిపరి విధముల పలికెద వేలను । తరులుము శమనుని ధామము జేరగ ॥వరె॥

వ॥ వరె గంధర్వా నీవు గర్వించినందుకు ఫలమనుభవించితివా,

సం-వ॥ యిట్లు గంధర్వుడు మూర్ఛపడి నంతలో కుంబీనసి దిగు లొంది శోకింపుచు అర్జునునిజేరి అనుట.

అర్జునునకు కుంబీనసికి - వాదం

కుంభీ॥ పతిభిక్ష బెట్టుమయ్య ప్రభువర యీ పణతికిపుడు । క్షితిలో నేనుండజాల పతివిహీన విధవమేల ॥పతి॥

అర్జు॥ అతివరో నీ వరుని యిపుడు హాతమొనర్చకను విడువను । ప్రతిమిలాడుటయు నీకూ ఫలమేమీలేదు పొమ్మి ॥అతి॥

కుంభీ॥ పాదంబులు వదులజాల పతిని విడచి బ్రతుకజాల । నాదు మొరగైకొనీ నానాధుని రక్షించు స్వామి ॥

అర్జు॥ క్రోధంబును విడియు నీనాథుని రక్షించితీని । పాదుగ పెద కందుకూరి పరమాత్ముని కృపవలనా ॥క్రోధం॥

వ॥ అబలా నీసుగుణంబుకు సమ్మతించి యిదో నీవరుని లేపితిని యిక మీ నిలయంబునకుఁ జనుడు.

సం-వ॥ యిట్లు అనుచుండగా గంధర్వుడు మూర్ఛదేరి అర్జునుని పాదంబులపై బడి.

దర్వు

గంధ॥ శరణిదె గైకొనుడు మీాదు చరణములకు మ్రొక్కెదాను । పరిపరి విధముల మిమ్ముల బలికితి నను కరుణించుడి ॥శర॥

వ॥ మహానుభావ మీా చరణంబులకిదె వందనంబు లాచరించువాడను నా నేరంబు లెన్నక రక్షించుడు.

అర్జు-వ॥ గంధర్వా నీకులసతి సుగుణంబులఁ మెచ్చి నిన్ను రక్షించితిని యిక మీా నిలయంబునకుఁ జనుడు.

సం-వ॥ యిట్లు గంధర్వులు వెళ్ళిపోయి నంతలో.

ధర్మరాజు అనుట

వ॥ అర్జునా యీ గంధర్వులు వెళ్ళిపోయిరి యిక మనము ద్రుపదుని పురంబునకుఁ జనుదాము పదుము.

చెలిత్రి

రాధేక్రిష్ణ గోపాలక్రిష్ణా ॥

సం-వ॥ యిట్లు పురంబుజేరి కుంతిదేవి అనుట.

వ॥ కౌమారులార యిచ్చట కుమ్మరవారి గృహము వున్నది కావున మనము యిక్కడనే నివాసము జేయుదాము మీరు స్వయం వరం వేళ్ళకు రాజుగారి సబకు జనుడు.

సం-వ॥ యిట్లు పంచపాండవులు కుంతిదేవితో సహితముగ కుమ్మర వారి గృహమున యున్నంతలో. హస్తినా పురంబున

దుర్యోధనుడు ప్రవేశం - దర్వు

దురవిక్రముడను దోర్బల శూరుడ దుర్యోధనుడను నేవినరా । కరి పురమును నే పరిపాలించెటి ఘనుడను వీర పరాకృడరా ॥దుర॥ సుతుడు లక్ష్మణుడు సుతలక్ష్మణయూ సుగుణాను గలిగిన వారలురా । క్షితిలోనను పెదకందుకూరు శ్రీపతిత పావనుని దలచెదరా ॥దుర॥

వ॥ సచివా మాపరాక్రమంబు వినుము దృతరాష్ట్రి గాంధారి గర్భజనితుండనై యీ నవఖండ పృధివి పరిపాలించు దుర్యోధన చక్రవర్తి యని గొనియాడెదరురా వారీ సూత్రధారి. యిచ్చట సభాసీనుండనై యుండెదగాక.

శకుడు ప్రవేశం - దర్వు

శరవిద్యలలో శ్రేష్టుడనేనిక శకుండయను బలుశూరుడరా । ధరణి జనులు నను పరిపరి విధముల నిరంతరము గొనియాడెరురా ॥శర॥ సుందర ధీరుడ సుగుణ విచారుక సుయోధనునికడ నుండెదరా । పొందుగాను పెద కందుకూరు శ్రీనందకుమారుని దలచెదరా ॥శర॥

వ॥ సేవకా నేను సదయంబు శ్రీభగవానుని పదంబుల ధ్యానించుచు హస్తినాపురంబున సుయోధనునికి సునయోక్తులన్ దెల్పుచు నుండెటి నానామంబు శకుండని యందురు. యింతలో రాజుగారి సభకు జనువాడా.

చౌలి

రాధే క్రిష్ణ గోపాల క్రిష్ణా॥

సం-వ॥ యిట్లు సభనజేరి దుర్యోధనుని గాంచి అనుట.

వ॥ సుయోధన నీమదిగల కోర్కెయేదియో విన్నవించు యీవిష యంబులేవియో గనుగొనెదగాక.

దుర్యోధనునకు శకునకు - వాదం

దుర్యో॥ మామా విను పాండవులను మరణము గావించితిమి। యేమిశంఖలేక యిపుడు యేలెద నవఖండ పృధివి ॥మామా॥

శకు॥ పామరులగు పాండవుల నామము లేకుండనాయె । భూమీశ్వర నీ వాకడవె భూభారము నిలుపుమయ్య ॥పామ॥

దుర్యో॥ పాలిపగయు దీరె వారి భాగము మనకును లభించె। వాల్లాయముగాను నాదు వాంఛయు యీడేరె నయ్యా ॥పాలి॥

శకు॥ ఫాలాక్షుని కృపవలనా పాలి భాగమును చిక్కెను। ఇమ్మిలో పెదకందుకూరి స్వామిని మదిమరువ కికనూ ॥ఫాలా॥

వ॥ దుర్యోధనా శ్రీపరంధాముని కృపవలన నాదాయాదుల భాగము చేజిక్కెను తమమనసానందంబుగ రాజ్యంబు పరిపాలింపుము.

సం-వ॥ యిట్లు యిరువురు సంభాషించుచున్నంతలో

కర్ణుడు ప్రవేశం - దర్వు

రాధారుక్మిణి నాధుని దలచెటి రణజయుడనునే కర్ణుడరా మోదముగను దుర్యోధను యాజ్ఞను కాదనకను చరియించెదరా ॥రాధా॥ అంగదేశమును పరిపాలించుచు ఆనందంబుగ నుండెదరా । రంగుమీరు పెదకందుకూరు శ్రీరమణుని మరువక దలచెదరా ॥రాధా॥

వ॥ సుబుద్ధీ నేను భుజబలపరాక్రమ విక్రమండనై అంగదేశమును పరిపాలించుచు యీ భూమండలమున వానకరుండని ప్రఖ్యాతి వహించిన నానామము కర్ణభూపాలుండని గొనియాడెదరు. యింతలో నేను సుయోధనుని సన్నిధికి జనువాడ.

చెత్తి

రాధేకృష్ణ గోపాల కృష్ణా ॥

సం–వ. యిట్లు సుయోధనుని సభజేరి తనలో

వ॥ వోహో శకుని దుర్యోధనులు యేమో సంభాషించుచున్నారు విచారించెద గాక. (ప్రకాశముగ)

వ॥ సుయోధన మీలో మీరు విచారించుచు కూర్చున్నారు కారణ మెద్దియో విన్నుడు.

దుర్యోధనునికి కర్ణునికి వాదం – చెత్తి

దుర్యో॥ ప్రాణా మిత్రా । యా పాండవేయులు పరమపదించిరి ॥ ప్రాణా॥ మానసమున అనుమానము దీరెను । దానకర్ణ ధర దక్కెను మనకూ ॥ప్రాణా॥

కర్ణు॥ మానవేంద్ర । వుపాయము లెన్నియు బన్నినగానీ ॥మానా॥ ప్రాణగాతలను బడయక నేటికి । మానుగ అగ్నిలో మరణించిరియిక ॥

దుర్యో॥ వురగంబులనూ । యటగరిపించిన విషఘాత నొందకను ॥ వుర॥ అరుదుగ మన యందరిని దూరుచును । దిరిగెను భీముడు దీరత్వంబునా ॥వుర॥

కర్ణు॥ మరణమొందె । టీ మరుగు లెన్నియూ బన్నినగానీ ॥మర॥ అరిమురికొల్పిన అన్నివృద్ధైతుద । వరకు లక్కమందిరమున మడసిరి ॥మర॥

దుర్యో॥ పన్నాగాను । విషపన్నము నిడినను పవనాత్మజుడూ । యెన్నికతో యా అన్నముదినిమన । సన్నిధిజేరెను సంతసముననూ ॥ప॥

కర్ణు॥ అన్నిటనూ । యే అరమరలేకను ఆనందించియు ॥అన్నీ॥ పన్నిగ లక్క భవనమందునా । కొన్నవారలు గతమైపోయిరి ॥అన్నీ॥

దుర్యో॥ వేయూవిధులా । యా వాయుకొమరూడు వడిబలంబుచే॥ వేయూ॥ పాయనిభాధలు జరపి చివరకు । కాయమువిడె లక్క గృహమందునా ॥వేయూ॥

కర్ణు॥ కాయామునగనూ । పెదకందుకూరి కరకంఠునికృపచే ॥కాయా॥ నీయభిలాషయు నెరవేరెనుయిక । పాయకపుడమినిపరిపాలించుము॥కాయా॥

వ॥ సుయోధన శ్రీపరంధామునిక్రుపచే నీయభీష్టమును నెరవేరెను యిక యీనవఖండపృథివి పరిపాలింపుము

దుర్యో-వ॥ కర్ణా యిదియునుంగాక నొకమనవి వినుము.

దుర్యోధనునికి కర్ణునికి వాదం

దుర్యో॥ ద్రోణాచార్యుని బాణవిద్యకును। నూనతమ్మెతిమి నూర్వ రమూను। గాన ధనుంజయు బాణవిద్యకును। ద్రోణుడు మెచ్చెను దోర్బ లుడనియు ॥ద్రోణా॥

కర్ణు॥ మానసమునసూ అనాటిచేసే। మదిలోవ్యాకుల మొందుచు నుంటిని। పూనుకున్నపని పూర్తినాయెను। యీనాటికి మనకేమి కొదువ యిక ॥మాన॥

దుర్యో॥ పాలివారల భాగము జిక్కెను। యేలెద రాజ్యము యేక ముగానూ। క్ష్మాలోనను పురజనులు బొగడగ। మేలుగనే పరిపాలన జేసెద ॥పాలి॥

కర్ణు॥ చాలగనూ భూజనులు బొగడగ। వాలాయంబుగ వాంఛ దీరగను। క్ష్మాలో కంచుకూరి ఘాబాక్షుని మది। మేలుగ దలచుచు యేలుము రాజ్యము ॥చాల॥

వ॥ దుర్యోధన మన దాయాదులు లక్కా గృహంబున ధగ్ధమై పోయిరి యిక నీవు యీ నవఖండ పృథివి యేకచక్రింబుగ పరిపాలింపుము.

సం-వ॥ యిట్లు సభలో జరుగుచున్నంతలో.

ద్రోణాచారి ప్రవేశం - దరువు

రాధాలోలా। నీపాదపద్మములు ప్రస్తుతించెదను ॥రాధా॥ ఆదీనుడ వీవని స్మరియించితి। మోదముగను నను బ్రోవుము శ్రీహరి ॥రాధా॥ దీనారక్షా। నాదిక్కునీవెయని మొక్కుచుంటిని ॥దీనా॥ గానలోల కన కాంబర ధరహారి। దానవ మర్ధన దయజూడుము నను ॥రాధా॥

వ॥ సచివాగ్రణి నేను కౌరవ పాండవులకు ధనుర్విద్య నభ్యసింపజేసి లోకంబెల్ల ప్రసిద్ధినొందిన నా నామంబు ద్రోణాచార్యుండని గొనియాడె దరు నేనింతలో సుయోధనుని సభకు జనువాడా.

చె ల్లి

రాఘేకిృష్ణ గోపాలకిృష్ణా ॥

సం–వ॥ యిట్లు దుర్యోధనుని సన్నిధికిఁ విచ్చేసి.

వ॥ సుయోధన యీ శకుని కర్ణాదులతో విచారించుచున్న విషయ మెద్దియో విన్నవించుము.

ద్రోణాచారికి దుర్యోధనునికి – వాదం

దుర్యో॥ గురువరేణ్యా వినుమా లక్క । గృహమున పాండవులూ నుండియు । సరిగ అర్ధరాత్రి ఆనిలంబున । అరుదుగ ఆహుతి పాతమై పోయిరి ॥గురు॥

ద్రోణా॥ దురియోధన యేమీా అట్టి । దురవిజయూలైన పాండు । వరకొమారులీ మరుగు నెరుంగక । పరమపదవి జేరిరి మహానీయులు ॥దురి॥

దుర్యో॥ యిరవుగ తమమదికి యిప్పుడు । యింతవ్యసనమేలా గురువర । పరమానందంబాయెను మనకిక । కరిపురమును నేపరిపాలించెన ॥

ద్రోణా॥ గురుదక్షిణయేనూ గోరగ । నరుడు నాదువాక్కు నమ్మియు । దురముజేసి యా ద్రుపదుని బట్టియు । సరగున దెచ్చెను సాహసశూరుడు ॥గురు॥

దుర్యో॥ వనమున జన్మించినట్టి । వారికోరకు వగపూ యేలను । ఘనశూరులు నాకును యిలలోనను । అనుజులున్నరూ అతిబల వీరులు ॥

ద్రోణా॥ అనుజు లెందారున్నాగానీ । అర్జును సరిరారూ పూనీ ॥ ధనుర్విద్యయందున యిలలోనూ । ధన్యత నొందెను ధనుంజయుండే ॥అను॥

దుర్యో॥ ఆర్య యెపుడు మీారూమాదూ । అన్నము గుడుచు చునూ యిప్పుడు । మీరుడనుమ యీ తీరు అర్జునుని । పేరు బాగజెదవు పూరుకొమ్మి యిట ॥ఆర్య॥

ద్రోణా॥ ధారుణి పెదకందుకూరీ । నారాయణునేలూ శ్రీహరి॥ ధారు॥ యేరీతిగమును యేలగలడోనను । దూరబోకుమీా దుర్యోధన యిక ॥ధారు॥

వ॥ దు ర్యో ధ న నేనను వాక్కులకు రౌద్రంబొందుట యేలను శాంత హృదయుడవై యీ నవఖండ పృధివి పరిపాలింపుము.

సం-వ॥ యిట్లు సంభాషించు చున్నంతలో.

భీష్మాచారి ప్రవేశం - దర్వు

గంగకొమారుడ ఘనబల శూరుడ । గాంగేయుండనునే వినరా ॥ సంగరనైరుల సమసి జేసినా శౌర్యపరాక్రమండను గనరా ॥గంగా॥ సుందరాంగుడను సుగుణాకరుడను । శూరుడ భుజబల వీరుడరా । పాండుగాను పెదకందుకూరు శ్రీనందకొమారుని దలచెదరా ॥గంగ॥

వ॥ సేవకా భుజబల పరాక్ర విక్రముండనై లోకంబులో పొగుడత నొందిన నా నామము భీష్మాచారియని గొనియాడెదరు. నేనింతలో దుర్యోధనుని సభకు జనువాడ.

చెత్రి

రాధేక్రిష్ణ గోపాల క్రిష్ణా ॥

సం-వ॥ యిట్లు సభజేసి దుర్యోధనుని గాంచి.

వ॥ సుయోధన కర్ణద్రోణాదులతో సంభాషించుచున్న విషయ మెద్దియో విశదపరచుము.

భీష్మాచారికి దుర్యోధనునకు - వాదం

దుర్యో॥ తాతాగారూ । మనదాయాదులునూ దహనంబయ్యిరి ॥ తాతా॥ ఖ్యాతిగాను యీ కరిపురంబును । హేతువచే నేయేలెద సదయము ॥తాతా॥

భీష్మా॥ నీతీలోనూ । యీ భూతలమును ప్రఖ్యాతిగనేలుము ॥నీతీ॥ నీతపంబునూ నేడు ఫలించెను । జ్ఞాతులు ధరలో గతమై పోయిరి ॥నీతీ॥

దుర్యో॥ యింతాలోనా । బలుసంతసమాయెను సాహసశూర ॥యింతా॥ మంతనమున యీకుంతి సూనులా । చింతన వదిలెను శంతను తనయా ॥యింతా॥

భీష్మా॥ కుంతీ సుతులూ । బలవంతులు వారలు వసుధలోపలా ॥ కుంతీ॥ అంతమొందిరని అన్నంతలోబల్ । చింతనగలుగును మంతనము. వనూ ॥కుంతీ॥

దుర్యో॥ శూరామనకూ । యిక వారివా ర్త లావరుసలు యెందుకు ॥శూరా॥ కోరికతో గజపౌరి సదనమును । నేనుపుగనుయిక నేలెద ముదమున ॥శూరా॥

భీష్మా॥ కౌరవేంద్రా । నీకాంక్ష దీరెయిక కరిపురమేలుమి ॥కౌర॥ ధారుణి పెదకందుకూరి నిలయుడౌ । మారజనకుని మదిలోనమ్మియు॥కౌర॥

వ॥ సుయోధన యూపాండుసూనులు భండన జయులు గనుక వొకా నొకప్పుడు జ్ఞప్తికి వచ్చెదరు. సరియె పరమపదవి జేరినవారికి వగవనేల యిచ్చట నివసించుదాము.

సం-వ॥ యిట్లు సంభాషించుచు యున్నంతలో.

దుశ్శాసనుడు ప్రవేశం – దర్వు

సుయోధనుని ప్రియ సహోదరుండను । సుగుణుడ దుశ్శాసను డనురా । నయంబుగను యీ నరవరులలో నేజయమొందిన యువరాజు నురా ॥సుయో॥ అందముగను నా అగ్రజుయాజ్ఞలో । పొందుగ నేచరి యింతునురా । డెందమందు పెదకందుకూరి శ్రీ । చంద్రశేఖరుని దలచె దరా ॥సుయో॥

వ॥ సేవకా నేను దుర్యోధన చక్రవర్తి ప్రియసహోదరుండనై విలసిల్లిన నా నామము దుశ్శాసనుండని గొనియాడెదరు కావున నేనిప్పుడు మా అగ్రజుని సన్నిధికి జనువాడ.

చెప్తి

రాధేక్రిష్ణ గోపాల క్రిష్ణా॥ (యింతలో)

సైంధవుడు ప్రవేశం – దర్వు

సింధుదేశ పరిపాలుడ నామము సైంధవుడని గొనియాడెరురా । అందముగను జనులందరు కొలువగ యిందరు మెచ్చిన వాడనురా ॥సింధు॥ మధోన్మత్తులను మథంబణచెటి । మహాబల పరాక్రమునువినరా । పృథివి లోనను పెదకందుకూరి మధుసూదనుని దలచెదరా ॥సింధు॥

వ॥ సచివా నేను భుజబల పరాక్రముండనై గదాధరుండనై సింధు దేశంబు పరిపాలించెటి నా నామంబు సైంధవుండని గొనియాడెదరు నేనిం తలో సుయోధనుని సభకు జనువాడ.

చె క్రి

రాధేకృష్ణ గోపాలకృష్ణా ॥ (యింతలో)

శల్యుడు ప్రవేశం - దర్వు

మదుసూదనునీ సదయము దలచెటి । మహాబలుడను నే శల్యుడరా। కదనమునను యెదురించెటి వైరుల । వధయొనర్చెటి వాడనురా ॥మదు॥ దృతరాష్ట్రిండ్మని సుతుండైన యా దుర్యోధనుకడ కేగెదరా । క్షితి లోనను పెదకందుకూరు శ్రీ । పతిత పావనుని దలచెదరా ॥మదు॥

వ॥ సుబుద్ధీ నేను ఖండనంబున వైరుల తండంబుల గుండెలుజీల్చెటి మహాబల పరాక్రముండనగు నానామము శల్యుండని బొగడెదరు. నేనింతలో కురువీరుని సన్నిధి కరగువాడా.

ధృతరాష్ట్రిడు ప్రవేశం - దర్వు

క్షితిలోనను సమ్మతి వహించినా । ధృతరాష్ట్రి మహారాజునురా । శత సుకుమారులు అతిబలశూరులు । సుత దుస్సలయను నామమురా ॥ క్షితి॥ సలలితముగ గాంధారి సాధ్విమణి । కులసతి యనబరగెను వినరా । యిలలోనను పెదకందుకూరు శ్రీ । జలజాక్షుని మదిదలచెదరా ॥క్షితి॥

వ॥ సచివాగ్రణి యీ నవఖండ పృధివికి అధిపతినై పొగడొంద బడిన నా నామము ధృతరాష్ట్రిండని గొనియాడెదరు శ్రీహరిని స్మరించుచు యిచ్చట నివసించెదగాకా (యింతలో)

విదురుడు ప్రవేశం - దర్వు

మదుసూదనునీ మదిలోదలచెటి । విదురుడ హరి సేవకుడనురా । విదితముగను కరిపురమునందునా సదయము మా నెలవును వినరా ॥మదు॥ ధారుణి పెదకందుకూరు ముప్పిడి । నారాయణునేల్ శ్రీహరినీ । సారెసారె కేమారక సదయము కోరిభజించెటి వాడనురా ॥మదు॥

వ॥ సచివాగ్రణి యెల్లప్పుడు డెందంబునందు శ్రీహరి ధ్యానమ్ము మరువక చరించెటి నానామము విదురుండని బిలచెదరు. నేనింతలో ధృత రాష్ట్రుని సన్నిధికిఁ జనువాడ.

చె ల్లి

రాధేకిృష్ణ గోపాలక్రిష్ణా ॥

వ॥ ధృతరాష్ట్రేంద్రి వందనము లాచరించువాడ.

ధృత-వ॥ జయప్రదముగా వర్ధిల్లుము. నొక యోచనగలదు యిచ్చట నివసించుము.

ధృతరాష్ట్రునకు విదురునకు - వాదం

ధృత॥ విదురా వినుమా । యీవిధికృప దప్పియు వీరపురుషులూ ॥ విదురా॥ సుదతి కుంతితో సదయులు పరమ । పదవి జేరిరీ పాండు కొమా రులం ॥విదురా॥

విదు॥ విదురాలోన । యీసదయులుండ శెరిసగము రాత్రియు ॥ విదు॥ సదనమునకు యేవిధమొ అగ్నిబడి। కాలిపోయిరి కుంతికుమారులు॥ విదు॥

ధృత॥ అనుజాడూను । వనమున గతియించిన దినము మొదలు కొని ॥అను॥ కనికరమున యీ తనయుల బెంచితి ఘనభుజబలులూ గతమై పోయిరి ॥అను॥

విదు॥ మనమూనందూ । యీఘన పాండవులూ జ్ఞప్తికి వచ్చిన ॥ మన॥ అనేకముగ మది అలలు కొల్పుచును । కనులనిండ నీరును వచ్చును యిక ॥మన॥

ధృత॥ భువిలో వారి । యేపోలిక లేకుంటాయెను విదురా ॥భువి॥ భవల్ ప్రతాపులు భండన విజయులు । భవనమునందున భస్మమయ్యిరో॥ భువిలో॥

విదు॥ యెవరికర్మొ । యిలయెటులనున్నదో యిలనాయక విను ॥ యెవరి॥ భువియీ వీరులు భుజబలశూరులు । వివిధ గతులయే విధినొందిరి యిక ॥యెవరి॥

దృత॥ యెందూగానా । యీ సుందరాంగుల అందచందమును ॥
యెందు॥ అంధుడనై నే మందబుద్ధిచే । పొందుగ వారల పురమెడలించితి॥
విదు॥ ఔందామందా । ఆనందియు మేలను సరసగుణాఢ్య ॥ఔం॥
పొందుగాను పెదకందుకూరు పుర । నందనందనుని నామము దలుప్రము ॥
వ॥ మహాత్మా పరముపదించిన వారికై వగపునొందనేల ధైర్యం
బవలంబింపుము.

సం-వ॥ యిట్లు సంభాషించుచున్నంతలో దుర్యోధనుని సభకు
పాంచాల దేశమునుంచి నొక యువకుడు శుభలేఖ గొనివచ్చి అనుట.

వ॥ మహాప్రభో పాంచాలదేశంబునేలె ద్రుపద మహారాజు ద్రౌపది
స్వాయంవరము గురించి శుభలేఖ బంపినాడు యిదో గాంచుడు.

దుర్యోధనుడు లేఖను చేకొని చదువుట

సీ॥ శ్రీయుత ధరపాల శ్రేష్టులకను ద్రుపద ♦ భూపరుండును వ్రాయు భావ
మిదియు ♦ సుకుమారి ద్రౌపదికి శుభలగ్నమునుజేయ ♦ స్వాయంవరము
నిర్మిస్తి సంతసమున ♦ సభను జేరగవచ్చి సాహసంబున నిలచి ♦ వడి
బాణమును బట్టి కడురయమున ♦ మహా విచిత్రంబైన మత్స్య
యంత్రముదెంచి ♦ మగువను చేకొనుడు మాన్యులార॥ గీ॥ యెంత్రి
మును గొట్టె విధమును యెట్టులనగ ♦ వొక్కసారె బాణంబును
యెక్కుబెట్టి ♦ వామనేత్రముకు గొట్టియు భూమిపైన ♦ బడగ వేయ
వలె యిదె యంత్ర ప్రతన వినుడీ ॥

సం-వ॥ యిట్లు చదివి సభాసదులగాంచి.

వ॥ వోహో భీష్మ ద్రోణ కర్ణశ్వద్ధామ సైంధవాధి యోధలార
పాంచాల దేశాధీశుండైన ద్రుపద మహారాజు ద్రౌపది స్వాయంవరము
గురించి శుభలేఖ బంపించినాడు. అట్టి స్వాయంవరము సభలో మత్స్య
యంత్రము బన్నియున్నాడట ఆ యంత్రమును దెంచినవారికి తన సుకు
మారియగు ద్రౌపదిని యిచ్చి వివాహంబు గావించువాడట మనమందర
మిప్పుడు యీ స్వాయంవరముకు జనుదాము పదుడు

భీష్మ॥ సరెసరె తమ యాజ్ఞాను పారముగ వెళ్ళుదాము పదుము.

కౌరవుల - వాదం

దుర్యో॥ తాతా వినుమా । యీ ద్రౌపది స్వయంవరమునుగాంచ గనూ ॥తాతా॥ యీ తేరున నివసించుమడి మీారలు । హేతువచే యిపు డేగుదమికనూ ॥తాతా॥

భీష్మా॥ ప్రీతితోనూ । వో భూతలాధిప పోదము పదుము ॥ప్రీతీ॥ నీతమ్ములనూ నెల్లర గూర్చుక । ఖ్యాతిగాను యీ కన్యను గనుగొన ॥

దుర్యో॥ ద్రోణాచార్యా । యీ ద్రుపదుని సభకునుతూగి జనుద మిక ॥ద్రోణా॥ మానసమున అనుమానము లేకను । మాణిని స్వయంవర మదిగాంచగనూ ॥ద్రోణా॥

ద్రోణా॥ పూనీ మనమూ । యీ భూతలనాథుని పుత్రికనూగన ॥ పూనీ॥ గానవినోదుని మానసమందును ధ్యాన్నము జేయుచు తరులుద మిప్పుడె ॥పూనీ॥

దుర్యో॥ రాధా తనయా । వో రణవిజయా యీరమణిని గాంచగ॥ రాధా॥ మోదముగను మన యోధలవెనుగొని । పోదమురమ్మిక । నాదు మిత్రుడా ॥రాధా॥

కర్ణు॥ నీదూవాక్కు । నేకాదనకను యిక కదులు దిప్పుడే ॥నీదూ॥ పాదుగనూ యీ పాంచాలాదే । శాధీశుని సమ్మోదముగనుటకు ॥నీదూ॥

దుర్యో॥ మామా శకునీ । యీ మత్స్యయంత్రమును మడయ జేయుటకు ॥మామా॥ నేమము దప్పక నేగుద మిప్పుడె । ప్రేమాస్పదము చె మీారురాండి యిక ॥మామా॥

శకు॥ భూమీాపాలా । యీ భూవరుడుండెటి ప్రోలుకు వేగమె ॥ భూమీా॥ కాముక జనుదము కనకరథంబున । తాము ప్రయాణము త్వరగ యొనర్చుడి ॥భూమీా॥

దుర్యో॥ అనుజా వినరా । స్వయంవరమునకును యరదుగ యిప్పుడు ॥అను॥ వినయంబుగనూ మన మందరమూ । జనగవలయును చయ్యన వెడలుమి ॥అనుజా॥

దుశ్శా॥ మనుజానాథ । యీ మత్స్యయంత్రమూ మహిమ యెట్టులో ॥మను॥ కనుగొనుదము అట కరగియు వేగమె । జనుదము పదుమిక జాగుసేయకను ॥మనుజా॥

దుర్యో॥ యిందూ రమిా । వో సైంధవ మహాబల సాహసశూరా॥ యిందూ॥ పాంచాల ద్రుపదుని పుత్రి స్వయంవరం । అందరమును గన అరుగుద మిప్పుడు ॥యిందూ॥

సైంధ॥ అందామునూ । యిక అరుగుదమిక పదు అవనినాయక॥ అంద॥ కందుకూరు పురమందు వెలసినా । చంద్రధరుని మదియందు దలచుచును ॥అందా॥

దుర్యో-వ॥ యోధానయోధులార మిారందరు శస్త్రాస్త్రంబులను ధరించుకొని రథంబులు శిద్ధపరచండి వెళ్ళుదాము.

సం-వ॥ యిట్లు కౌరవులు స్వయంవరమునకు జనుటకై ప్రయత్నం చేయుచుండగా.

( ద్వారకలో )

కృష్ణుడు ప్రవేశం - దర్వు

యదువంశజుడను యశోద తనయుడ । మధుసూదనుడను నేవినరా। పృధివిలో దాసుల హృదయమునందున సదయమునే చరియించెదరా ॥యదు॥ నీలవర్ణుడ నిఖిల లోకముల పాలనజేసెటి వాడనురా । మేలగు రాధాలోలుడ గోపరిపాలుడ పంకజ నాభుడరా ॥యదు॥ ద్వారకవాసుడ దామోధరుడను దానవ మర్ధనుడను వినరా । ధారుణి పెదకందుకూరి ముప్పిడి నారాయణునేలె వాడనురా ॥యదు॥

వ॥ యుద్ధవా దేవకి వసుదేవ గర్భజనితుండనై విలసిల్లిన నానామము గోపాలకృష్ణుండని గొనియాడెదరు కావున యిప్పుడు పాంచాల దేశాధీశుండైన ద్రుపదుడు ద్రౌపతి స్వయంవరము నిర్మించి శుభలేఖ బంపించెను యింతలో నేను యా ద్రుపదుని సభకుజ జనుచాడను.

సం-వ॥ యిట్లు క్రిష్ణుడు రథంబు శిద్ధపరచు చున్నంతలో.

బలరాముడు ప్రవేశం - దర్వు

బలపరాక్రముడను భండన జయుడను బలరాముడనూ నేవివరా । యిలలోనను యెదురించిన వైరుల యేపుమాపెటి శూరుడరా ॥బల॥

శ్రీశుభాంగుడను శిష్టపాలుడను శ్రేయస్కరుడను మదిగనరా । భాసురముగ పిదకందుకూరి విశ్వేశుని ధ్యాసయు మరువనురా ॥బల॥

వ॥ మత్ ప్రభావంబెరంగింతెద వినుము సచివా నేను భుజబల పరాక్ర విక్రమాంకన । వైరుల తండంబుల గండడంచి మెండుగా యీ భూమండలంబున జయమొందిన నా నామము బలరాముడని సకల జనులు గొనియాడెదరు కావున యిప్పుడు శ్రీక్రిష్ణునిసన్నిధికిఁ జనువాడను.

చె లి

హరహర శంకర పాపభయంకర ॥

సం–వ॥ యిట్లు శ్రీక్రిష్ణుని జేరి అనుట.

వ॥ సహోదరా క్రిష్ణా రథంబుశ్రృంగారించి శిద్ధముగానుంచినావు యేకార్యము సాధించుటకై జనుచున్నావో వాక్రుణింపుము.

క్రిష్ణు–వ॥ అన్నయ్యా యిచ్చట నివసించుడి విన్నవించెదను.

బలరామ క్రిష్ణుల – వాదం

బల॥ చిన్ని అనుజ క్రిష్ణా నీవూ । చెన్నుమీరగ నూ రథమున । క్రిన్ననతో యేకార్యంబునకును । కదులుచుంటివో కాంక్షతో దెల్పుమి॥

క్రిష్ణు॥ అన్న సగనుగొనుమా యిప్పుడు । అతిముదమొందు మనమూ మనమూ పన్నుగ వినుము ద్రుపదుని సన్నిధికి । యెన్నిక మీరగ యేగుద మిక పదు ॥అన్న॥

బల॥ యేపనికై మనమూ వేగమే । యేగవలయు దెల్పా క్రిష్ణా । గోపబాలక యీ పురమునకును । యీ పట్లను జనుటేమి విచారమొ॥

క్రిష్ణు॥ ద్రౌపతి స్వాయంవరమూ బూనియు । ధరణీశుడు మనకూ లేకను । బాపని వారిచె బంపించెను విను । నీపై నంబును నె ప్పుడొ దెల్పుమి ॥ద్రౌప॥

బల॥ సరెసరె అట్లైనా మనమూ । సరగున నేగుదమూ రథమున । తరలుము మధుసూదన జాగేలను । నరవరునీ సభనట్టె గాంచగను ॥సరె॥

క్రిష్ణ॥ యిరవొందగ యికనూ రథమును । యెక్కుడీ శీఘ్రిముగా అన్నయ । ధరణి కంసుకూరి ధాముని దలచుచు । సరగున జనుదము స్వాయంవరముకూ ॥యిర॥

సం-వ॥ క్రిష్ణా యీ తేరున నివసించి యుంటిని యిక వెళ్ళుదాము పదుము.

## క్రిష్ణుని చెల్తి

హరహర శంకర పాపభయంకర । గిరిజమనోరమణా శంభో । కరి చర్మాంబరగజ దానవహర । కరుణాకర రారా శంభో ॥హర॥ కాలకంఠ యమగర్వ విలుంఠన ఫాలనయన దేవా శంభో । జాలమేల కరుణాలవాల మాపాలిదేవ రారా శంభో ॥హర॥

సం-వ॥ యిట్లు విచ్చేయుచున్న బలరామ క్రిష్ణుల ద్రుపదుడు వీక్షించి,

• వ॥ వోహో శ్రీక్రిష్ణ బలరాములు విచ్చేయుచున్నారు యెదురుగా జనివందనంబాచరించెదగాక.

## బలరామ క్రిష్ణులకు ద్రుపదునకు - వాదం

ద్రుప॥ దండము బలరామ క్రిష్ణ దండములిదో గైకునుడీ । రాండి యిచ్చటా నివసించండి పీఠమందు వేగ ॥దండ॥

క్రిష్ణ॥ నిండుగ వర్ధిల్లుమీ భూమండలమున ద్రుపదభూప । ఖండేందు ధరుడు మిమ్ము కరుణించును సదయముగాను ॥నిండు॥

ద్రుప॥ మాధవ యీ మీనమునూ భేదించిన వారి కిపుడు । నాదు పుత్రికను నొసగెద వోదయాకరా వినుము ॥మాధవ॥

క్రిష్ణ॥ నీదు ప్రతిన మెచ్చియుంటి నింతలో సమ్మోదమునాయె । యోధాన యోధలెవరు భేదించా గలరా నేడు ॥నీదు॥

ద్రుప॥ దేవదేవ యీ యంత్రమును యీ వసుధలో నెవ్వరైన । భావ మెరగి ద్రుంచునట్టి భూవరులున్నరో లేరో ॥దేవదేవ॥

క్రిష్ణ॥ యేవిధమైననుగెలచ్చా యెందుకు వ్యాకుల మొందెదవు భావముననుకందుకూరి పరమాత్మని నమ్మియుండు ॥యేవిధ॥

వ॥ ద్రుపదభూప ధరణిగల యోధాన యోధలలో యెవ్వరైన నొక్కటు ద్రెంచగలరు వార్రికులం బొందకుము.

సం-వ॥ యిట్లు సంభాషించుచు నివసించి యున్నంతలో.

దుర్యో-వ॥ భీష్మ ద్రోణ కృపశ్వద్ధామ సైంధవాది యోధలార యిక రధంబులు తరలించండి స్వయంవరమునకు జనుదాము.

దుర్యోధనుని - చెలి

రధగజతురగా ణుపచేకొని । కదులుద మిప్పుడు కడుసమ్మోద మున । విదితంబుగను ద్రుపదుని సదనమునకు । వేగిరముననూ వెళ్ళుద మికనూ । ద్రోణ భీష్మ కృప దుశ్శాసనులు । దోర్బలసైంధవ దురజయ వీరులు । శల్య కర్ణ అశ్వద్ధామలగొని । సరగున వెళ్ళెద స్వయంవరముకూ॥

సం-వ॥ యిట్లు కౌరవులు స్వయంవరముకై జనుదేరగనే ద్రుపదుడు గాంచి అనుట.

ద్రుప-వ॥ కౌరవ వీరులార విచ్చేసియుంటిరా యిచ్చట నివసించుడు.

యింతలో పాండవులు అనుట

వ॥ జననీ మేము స్వయుంవరము సభజేరగ బోయెదము నీవు యీ కుమ్మరవాని గృహమందుననే యుండుము.

కుంతి-వ॥ కొమారులార జయప్రదముగా పోయిరాండు.

ధర్మరాజు అనుట

వ॥ సహోదరులార ద్రుపదుని సభకు వెళ్ళుదాము రాండు.

చెలి

రాధేక్రిష్ణ గోపాలక్రిష్ణా ॥

సం-వ॥ యిట్లు సభజేరవచ్చి భూసుర బృందములో నివసించి యున్నంతలో.

## శిశుపాలుడు ప్రవేశం - దర్వు

శశిధరునీమది పొసగ దలచెటి । శిశుపాలుండను నేవినరా । విశదము గను నే దశదిశలందున అసహాయా వ్రూరుడ వినరా ॥శశి॥ బలపరాక్రమను బలువగు యోధులజట్టి నధించెటి వాడనురా । యిలలోనను పెదకందు కూరు శ్రీ । జలజనాభునీ దలచెదరా ॥శశి॥

వ॥ సేవకా దశదిశలయందు పేరొందబడిన నానామముగు శిశుపాలుం డని గొనియాడెదరు కావున ద్రుపద మహారాజు ద్రౌపది స్వయంవరమని లేఖ బంపించినాడు యింతలో వారి సన్నిధికిక్ జనెదకాక.

## చౌలి

రాధేకృష్ణ గోపాలకృష్ణా ॥

సం-వ॥ యిటు శిశుపాలుడు ద్రుపదుని సభ జేరగనే.

## జరాసంధుడు ప్రవేశం - దర్వు

పరాక్రమునబల్ బవర మొనర్చెటి । జరాసంధుడను నేవినరా । ధరా వైరులను దర్పమణంచెటి దండిశూరుడను మదిగనరా ॥ పరా ॥ రారాజుల చెచ్చెర బంధించియు పేరువహించిన వాడనురా । ధారుణి పెదకందుకూరిలో వెలసిన । ధవళాంగునిమది మరువనురా ॥పరా॥

వ॥ వరె సుధీరా దేశాధీశులక్ రణంబున గడగడ వణకించుచు మగధ దేశంబు పరిపాలించెటి వాడను నానామంబు జరాసంధుడని పలు విధంబుల గొనియాడెదరు కావున ద్రుపద మహారాజు సుకుమారి స్వయం వరముకై శుభలేఖను బంపించినాడు యిప్పుడు యీ సభకుక్ జేరబోయెద గాక.

## చౌలి

హరహర శంకర పాపభయంకర గిరిజమనో రమణా శంభో ॥

సం-వ॥ యిట్లు వసుధీశులు మొదలుగాగల యావజ్జనంబులందరు విచ్చేసి యుండగా

ద్రౌపదిదేవి ప్రవేశం - దరువు

ద్వారకవాసుని ధ్యానము జేసెటి । ద్రౌపదిదేవిని వినవమ్మా । నారీమణులను జేరికొలువగను నేరుపుగను వచ్చితి నమ్మా ॥ద్వార॥ నవ రత్న హారముల నెప్పుడూ । సవినయముగ దాల్చెదనమ్మా । భువిలోనను పెదకందుకూరు శ్రీమురహారిసీ మరువనె కొమ్మా ॥ద్వార॥

వ॥ చెలియా సాటి చేడెలతో గుమిగూడి ఆటలాడుచు యిటు వచ్చియుంటిని నా నామము ద్రౌపదిదేవియని యందురు నేనిప్పుడు మా జనకుని సన్నిధికి నేగుచున్నా.

చె లి

రాధాకృష్ణా గోపాలకృష్ణా ॥

ద్రౌపది-వ॥ జనక వందనములు,

ద్రుపద-వ॥ సుకుమారి చల్లగా వర్ధిల్లుము నీలగ్నంబుకై యిచ్చట మత్స్యయంత్రంబు నిర్మించి స్వయంవరమని శుభలేఖలుబంపి దేశాధీశులెల్ల రను రావించితిని. యిప్పుడు యీసభలో మత్స్యయంత్రంబు నెవ్వరు ఛేదించ గలరా గాంచి వారలెట్టివారైన విచారవడక వారికంఠమున పూలమాల వేయుము. యిదో హారము చేకొని సభా మధ్యనముండుము.

ద్రౌపది-వ॥ జనకా మీరు దెల్పిన ప్రకారమె చరించుదానా.

సం-వ॥ యిట్లు పూలమాల చేకొని ద్రౌపతి దేవి స్తంభము సన్నిధి నిలచి యుండగ ద్రుపద మహారాజు సభాసదుల గాంచి అనుట.

ద్రుపద-వ॥ దేశాధీశులాది యోధాన యోధాలార నొక సంగతి నెరంగించెద వినుడు.

సీ॥ మహిపతులార యీ మరుగు దెల్పెద వినుడి వాంఛతో యెటువంటి
వారలైన ♦ మత్స్యయంత్రము ఛాయ మంచి జలములో గాంచి ♦
ఛేదించు వారికి ప్రియము మీర ♦ ద్రౌపతి నొసగియు దనర లగ్నము
జేసి ♦ ధనకనకవస్తు వాహనములిచ్చి ♦ కడుసమ్మోదంబున కాల్బంబుల

నిచ్చి ♦ పంపించెదను జనులు భళీయనంగ గీ॥ గావయీా దీక్ష బూనితి కాంక్షమీార ♦ వినుడి యిప్పుడు మీారలు వేగలేచి ♦ శరములను ధరి యించియు గురియు గాంచి ♦ గొట్టుడిక నెవ్వరైననూ యిట్టి సభలో ॥

పం-వ॥ యిట్లు దెలుపగనే దుర్యోధనుడు లేచి అనుట.

వ॥ సరెసరె యీా ద్రుపదుడు జన్నిన మత్స్యయంత్రమును తెగ టార్చి యీా నారీమణిని చేకొని కరిపురంబునకు జనియెదగాక.

చె లి

యీా సభయందున యింపుతో జన్నిన । యీా యంత్రంబును యిప్పుడె ద్రుంచియు । నాసిగాను యీా వనితను నేడును । వాంఛదీర వైవాహికమాడెద ॥

వ॥ నేను యీా స్తంభము సన్నిధిజేరి గాంచితినిగాని ధనుర్బాణము చేకొని యీా యంత్రము తెగటార్చెదగాక.

మత్స్యయంత్రమును ఛేదించుట

చె లి

బలపరాక్రమున బాణము బట్టియు । జలమున నీడను చయ్యన గనుగొని । తొలుగ కుండనే దృష్టినిలిపియును । యిలపై వ్రాల్చెద యీా యంత్రంబును ॥ శ్రీవేణుగోపాల స్వామికి జై

(తనలో)

వ॥ ఆహా యిదియేమిచిత్రము గురిగాంచివైచిన బాణము మీానము నకు దాకక వృధా ఆయెను బలహీనుని విధంబుగా యీా సభలో నూనత నొందవలసి వచ్చెను యిక యేమి చేయుదును యిచ్చట నివసించెదగాక.

శిశుపాలుడు లేచి అనుట

వ॥ వోహోహో సుయోధనుండు గురిగానక యంత్రమును ఛేదించ కుండెను. నేనింతలో ధనుర్బాణముచేకొని ద్రుపదుడు జన్నిన యంత్రమును ఛేదించి యీా లలనామణిని వివాహమాడెదగాక.

చె త్రి

ఘన స్తంభమునకు గట్టిన మీనము । ఘనమాద్యంచుట ఘడియ లో నేజని । ధనుర్బాణమును త్వరగను బట్టియు । తప్పకద్యంచియు ధరపై వైచెద ॥ఘన॥ శ్రీవేణు గోపాలస్వామికి జై

వ॥ సరేసరే నిప్పుడు బాణముచేకొని స్తంభము సమీపమునకు జేరితిని గురిగాంచి యీ యంత్రమును భేదించెదగాకా.

చె త్రి

బాణముచేకొని మీనమిప్పుడు । బడవైచెదనూ బలునుడమునసూ । గాన నేను గురిగాంచియు వేగమే । ఘన యంత్రంబుకు గ్రక్కున విడచెన ॥బాణ॥

త న లో

వ॥ ఆహా యీ సుయోధనుని గురిదప్పినదను కొంటిని గాని యిప్పుడు నేను సంధించిన బాణముకూడ వృథా ఆయెను. నేను విలువిద్యలలో ప్రవీణుండనై యీ సభలో యవమానత నొందవలసి వచ్చెను గదా యిక యేమి చేయువాడను యిచ్చట నివసించెద గాకా.

జరాసంధుడు లేచి – అనుట

వ॥ అహా యీ శిశుపాలుడు గూడ గురిగానక మత్స్యయంత్రమును భేదించకుండెను. నేను జనిధనుర్బాణము చేకొని త్వరలో భువిపై వ్రాల్చెద గాకా.

చె త్రి

సరగుడ నేజని సాహసమునసూ । శరమును చేకొని చయ్యన యిపుడుగ । గురిగాంచియు నే గుర్తెరింగియూ । గూల్తు మీనమును కోరిక దీరగ ॥

వ॥ నేను స్తంభము సన్నిధికి జేరతినిగాని ధనువును చేకొని మత్స్యయంత్రిమును బడగూల్చెదగాక.

చెల్లి

ద్రుపదుడు బన్నిన దొడ్డయంత్రిమును । దునిమెద వేగమె దోర్బల మునమా । యిపుడే గురిగని యీ మీనంబును । యెగుర జిమ్మెదను యేపుగనేనుక్ ॥

( తనలో )

వ॥ ఆహా యిదియేమి చిత్రిము యిచ్చట బన్నిన యంత్రతంత్ర మును యెరుగనైతినిగదా నేను ప్రిపంచ రాజులతో బవరంబొనర్చి కారాగృహములో వైచిన బలపరాక్రి మెందుబోయెనోకదా నేడు యీ సభలో అవమానత నొందవలసి వచ్చెనుగదా. యిక యేమిసేయు వాడను యిచ్చట నివసించెదగాక.

కర్ణుడు లేచి అనుట

వ॥ వోహెూ యీ యోధలు సూటెరుంగక మత్స్యమును నేలక్ బడద్రోయక మరలివచ్చిరి. నేనుజని నాభుజబల పరాక్రి విక్రిమం బుచే గురిగాంచి యీ యంత్రమును గూల్చెదగాక.

చెల్లి

యోధలెల్లనూ యీ యంత్రింబును । ఛేదించుటకై బిరుదును బూనియు । పాదుగజలములో పరీక్షించకను । బాణము విడచిన పడునా మీనము ॥

వ॥ సరియె యీ స్తంభము సన్నిధి జేరితినిగాని ధనుర్బాణము చేకొని యీ మీనమును ధరపై బడగూల్చెదగాక.

చెల్లి

ద్రుపదుడు గట్టిన తుచ్ఛయంత్రమును । దునిమివైచెదను ధనువును చేకొని । యిపుడే సంధించియును విడచితి । యిలపై వ్రాలును యీ మీనంబును ॥

వ॥ ఆహా యిదియేమి విచిత్రిము వోరలేకుండ గురిగాంచి విడచిన బాణము యంత్రిమునకు దాకకపోయెను. యిదియేదో మాయగానున్నది.

నామది కెద్దియుఁ దోచుటలేదు. యెన్నడు లేనిది నేటికి యీ సభలో అవమానమొందవలసి వచ్చెను యిక యేమిజేయుదును యిచ్చట నివసిం చెదగాక.

శల్యుడు లేచి అనుట

వ॥ యీ కర్ణుడుగూడ మీనమును భేదించక మరలివచ్చెను నేను జని గురిగాంచి భేదించెదగాక.

చె ల్తి

నారిని గుంజియు నటుగురిగాంచియు । నీరుననీడను నేగనిపెట్టియు । ధీరమీర సంధించియు మీనము । జేరగ విడచితి ధారుణిపైబడ ॥నారిని॥

వ॥ ఛీ యింత యాశా భంగము సంభవించుటయేగాక పదుగురిలో అవమాన మొందవలసి వచ్చెనుగదా. నేటుగ గురిగాంచి కొట్టినా గాని యా మీనమును బడకుండెను. యిందులకు యేమిచేయువాడను యిచ్చట నివసించెదగాక.

సం-వ॥ యిట్లు శల్యుడు నివసించగనే.

సైంధవుడు లేచి అనుట

వ॥ వోహో యీ యోధాన యోధులలో నొక్కరైన భేదించ కుండిరి నేనింతలోజని యీ మత్స్యయంత్రమును భేదించెదగాక.

చె ల్తి

యోధాన మహా యోధులు నెల్లరు । భేదించకనూ బిరుదులు మానిరి । పొదుగాను నాపటు శరంబుచే । పడవైచెద యీ పట్ల మీన మును ॥యోధాన॥

వ॥ సరెసరె యిప్పుడు స్తంభము సన్నిధికి చేరితిని వోరలేకుండ గురిగాంచి యంత్రమును భేదించెదగాక.

చె ల్తి

మదినుదమొందుచు మత్స్యయంత్రమును । మహిపై వ్రాల్చెద మానక యిపుడుఁ । విదితముగను నా వీరత్వముచే । పదను శరంబును పరగ విడచితిని ॥మది॥

వ॥ ఛీ నేను యిక్కడికి యెంతఆశచే వచ్చిన కార్యము వ్యర్థం బాయెను నేటుగ గురిగాంచి శరంబు సంధించినా గాని మీనముకు చాకక యెగిరిపాయెను. యిట్టి సభాసదుల మోల అవమానమొందవలసి వచ్చెను. యిక యేమి చేయువాడ యిచ్చట నివసించెదగాక.

సం-వ॥ యిట్లు దేశాధీశు లెల్లరు మత్స్యయంత్రమును భేదించ లేక నివసించియున్నంతలో అర్జునుడు ధర్మరాజునుగాంచి అనుట.

వ॥ అగ్రజ యీ యోధానయోధలు బెదించక జాలక నూనతయై నివసించిరి కావున మీరు శలవొసంగినచో యీ మత్స్యయంత్రమును నేను భేదించగలను నాపై దయదలంచి శలవొసంగుడు.

ధర్మ-వ॥ సహోదర శ్రీక్రిష్ణభగవానుని పాదముల నీడెందమందు నిల్పి మత్స్యయంత్రమును భేదించుము పొమ్ము యిదియే నాయాజ్ఞ.

అర్జు-వ॥ సరెసరె యిక వెళ్ళి భేదించగలను.

సం-వ॥ యిట్లు అర్జునుడు లేచి పోవగ భూసురులు వీక్షించి.

అర్జునునికి భూసురులకు - వాదం

భూసు॥ నిలువు మత్స్యయంత్రమును నీవును భేధించలేవు। నలవి గాని కార్యమునకు నరుగుట వలదయ్య విప్ర ॥నిలువు॥

అర్జు॥ వందనగాబోకు విప్ర వాసుదేవునీ కరుణచె। యిలపై యీ మీనమును యిప్పుడె బడగూల్చగలను ॥వల॥

భూసు॥ యోధాన యోధలెవరు భేదించా లేకపోయిరి। పేదవారు డవు నీతోకాదు వినుము యీకార్యము ॥యోధాన॥

అర్జు॥ వాదుయేల వదులుమిపుడు వడిబాణము చేకొనియును। మోదముగను భేదించియు ముదితను చేకొనియెదాను ॥వాదు॥

భూసు॥ యేకచక్రపుర ద్విజులకు యెగతాళికి దెచ్చెదావు। యీ కార్యంబునకు జనియు యిలలో జయమొందలేవు ॥యేక॥

అర్జు॥ వ్యాకులంబు మానుడీ నేవ్రాల్చెద మీనమును నిపుడు। ప్రాకటముగ కందుకూరి పరమాత్ముని కృపవలనా ॥వ్యాకు॥

వ॥ భూసురులార పరంధాముని కృపవలన నే భేదించగలను నన్ను వదులుడు.

భాసు-వ॥ సరెసరె నీవు భేదించేది యిక జూడమా చెప్పంగ వినసి వాన్ని చెడంగ జూడవలయు నన్నట్లు కాగలదు యిక నీయిష్టము పొమ్ము.

సం-వ॥ యిట్లు సంభాషించుచుండగ బలరాముడు గాంచి క్రిష్ణునితో అనుట.

బలరామ క్రిష్ణుల - వాదం

బల॥ చూడుము క్రిష్ణా।యిక వాడెవడో వడిబలమున॥చూడు॥ వేడు కతో లేచియు కడువీరుడయ్యె నిలుచుటచే । నేడు చోద్యమాయెమరి కి జాడదెలియునా వాని ॥చూడ॥

క్రిష్ణు॥ నేడు మనమునూ । యినచూడగ ఫల్గుణుని విధము ॥నేడు॥ పాడిగగను పట్టుచుండె పౌరుని రూపముననుండి । నాడు జనియు చివరకు యీ నాటికి యిటుజేరి నారు ॥నేడు॥

బల॥ అట్టులనైన । యీ గుట్టుదెలిసి కొట్టు నిపుడు ॥అట్టు॥ దిట్టత నమువల్లనూ యీ పట్టిని చేపట్టగలడు । పట్టరాని సాహసముచె యెట్టుల నున్నడు చూడూ ॥అట్టుల॥

క్రిష్ణు॥ యెట్టులనైన । యిటగట్టిన మీనమును ద్రుంచు ॥యెట్టు॥ చుట్టరికముగలియును యీ పట్టున ద్రుపదునకు వేరె । యెట్టియోధులైన దీన్ని కొట్టజాలరికను వినుము ॥యెట్టు॥

బల॥ శూరుడు నరుడూ । దమీతీరున వధించునో కో ॥శూరుడు॥ పారులు వలదని వెనుకకుపట్టి లాగుచుండిరి యిపుడు।వీరపురుషునీ శౌర్యము వేరె నుండునూ క్రిష్ణా ॥శూరుడు॥

క్రిష్ణు॥ ధారుణిలోనూ । కందుకూరు దాసదాసులాను ॥ధారు॥ కూరిమి మీరగ బోధిచియు కొంతతడవు మనమిచ్చట । పౌరునీ స్వరూపు నున్న ఫల్గుణుని గాంచుదాము ॥ధారు॥

వ॥ అగ్రజ యీ విప్రస్వరూపమున నున్న అర్జునుని సరిగ పరీక్షించు దాము నీవు యీ వాక్కు రహస్యంబుగ నుంచుము.

సం-వ॥ యిట్లు బలరామ క్రిష్ణులు నుడువు కొనుచు నివసించి యున్నంతలో.

అర్జు-వ॥ విప్రులార అనుమానించకుడు నేను జని యీ యంత్రి మును భేదించ గలను.

చె ౖౖ

కరివరదుని మృదుచరణంబులనూ। స్మరణజేసి సద్గురుని దలంచియు। శరమును చేకొని సరిగ మీనమును । ధరపై గూల్చియు ధన్యత నొందెద ॥కరి॥

వ॥ అహా నేను యిప్పుడు యీ స్తంభము సన్నిధికి చేరితినిగాని ధనుర్బాణముచేకొని గురిగాంచి శ్రీక్రిష్ణ పరంధాముని దలచుచు యీమత్స్య యంత్రిమును భేదించెదగాకా.

యంత్రిమును భేదించుట

చె ౖౖ

శరమును చేకొని చయ్యననిపుడుౘ। గురిగాంచియు నేకోరిక దీరౘ। సరగున విడచితి త్వరగ మీనముౘ। ధరపై గూలెను ధ్ఙ మనియనుచుౘ ॥శరము॥

ఆహా యేచక్రపుర విప్రులందరు వలదనగ వచ్చిన కార్యం సఫలంబాయెను సంతోషమున యిచ్చట నిలచెదగాకా.

సం-వ॥ యిట్లు మత్స్యయంత్రము ధరపై గూలగనే సభాసదులందరు చప్పట్లు వేయుచుండగా.

ద్రౌపతిదేవి పూలమాల చేకొని అనుట

చె ౖౖ

వేసెదమాల విభుని కంఠమున । వాసిగానుబల్ వాంఛతో నిపుడుౘ । వాసుదేవునీ ద్యాసజేయుచును వేసితి హారము వేడుకమీరౘ ॥వేసె॥

వ॥ నాథా నమస్కారములు.

అర్జు-వ॥ సఖీ జయప్రదముగా వర్ధిల్లుము.

సం-వ॥ యిట్లు వందనంబాచరించుచుంగా దు ర్యో ధ ను డు లేచి అనుట.

దుర్యో-వ॥ వరే దృపదా ద్రౌపతి స్వాయంవరమని భూపతులకు లేఖలు వ్రాసి రావించి యీ సభయందున యంత్ర యంత్రిమును బన్ని

నరవరులు గాంచుచుండగా నీసుకుమారిని భూసురున కొసంగుట నీకు హితవౌన ఛీ నీచకులాధమ యావిప్రుని నిన్ను బంధించి ద్రౌపతిని చేకొని కరిపురంబునకు జనువాడను. యిదియే నేను బన్నెటి ప్రతిజ్ఞ, నూరుండ వైనచో సంగరంబునకు నిలువుము.

ద్రుప-వ॥ వరే సుయోధన నేను శుభలేఖలో వ్రాసిన విధంబుగ మత్స్యయంత్రమును గూల్చిన వారికి ద్రౌపతిదేవినిచ్చి వివాహంబుగావించె దను గాని వేరుకాదు. యీనీచ వాక్కులు చాలించి నీసదనంబునకుక్ జనుము యేలా యీవృధా ప్రసంగము.

## దుర్యోధనునకు ద్రుపదునకు - వాదం

దుర్యో॥ రారాజులనూ రావించియునూ । రాకొమారినీ రాజుల కివ్వక । పోరున కొసగుట మేరగాదురా । వోరిద్రుపద నిను వధగావించెద॥

ద్రుప॥ దూరభారముచె దూరనాడెదవు । దురాచార వో దుర్యోధన వినుı రారాజులకును వ్రాసినలేఖా । తీరు జేసెదను తీవ్రమేలరా ॥దూర॥

జ్ఞానహీన సభలోన మమ్మలా । నూనతజేస్తివి గాన నిన్ను నే । మానక నిన్నిట మర్ధన జేసియు । యీనాడును నే యింపుతో బోయెద ॥జ్ఞాన॥

ద్రుప॥ శాణతెనము వావూని పూర్వమున । దోృణుని వాక్కు చెదురము జేసియూ । బాణఘాతలకు పారిపోయితివి । మానహీన యది మరచితి వేలరా ॥శాణ॥

దుర్యో॥ మీరిపల్కుచును దూరుచుంటివిర । క్రూరనిన్ను యిట కూలగ జేసియు । కూరిమితో పరివారము గొలువగ । జేరబోదు గజ పోరికి నేడును ॥మీరి॥

ద్రుప॥ చోర నిన్ను యీ పోరున బట్టియు । నృక్కణగించెద చూడర నేడును । ధారుణి కందుకూరి నివాసుని । దలచియు యిక నీదర్ప మణంచెద ॥చోర॥

వ॥ వరే పూర్కన్న కొలది మితిమీరి పల్కుచుంటివ నిలువుము.

సం-వ॥ యిట్లు యిరువురు కలహించుచుండగా ధర్మరాజు సోదరుల గాంచి అనుట.

వ॥ సహోదరులార యీ దుర్యోధనుని దుర్మార్గంజేసుని గొని యాడనగును యిప్పుడు యీ దృపదునిచే అన్యాయముగా ఆలము జేయుచున్నాడు. మనము యీ దృపదుని వంక జేరి కౌరవులను పారదోలుదాము పదుడు.

భీము-వ॥ సరెసరె అగ్రజా మామన సానందంబౌనట్లు కౌరవులచే కదనంబొనర్చెదము మీయాజ్ఞకు యెదిరి చూచుచున్నాము.

సూ-వ॥ యిట్లు అనుచుండగ యేకచక్రపుర బ్రాహ్మలు గాంచి ఉనుట.

వ॥ వోహో భూసురులార రాండు రాండు మనవర్ణముకు వన్నె దెచ్చిన వారలతో గలసి యుద్ధంబుజేసి కౌరవుల పారదోలుదాము మీరందరు జాలిచేబులు చిన్నపంచెలకు కట్టుకొని రాండపు రాండు.

భీమునకి దుర్యోధనునికి - వాదు - చెల్తి

భీము॥ కౌరవేశు వినరా నిన్నూ । కదనము నందుననూ బట్టియు । కోరిక దీరగ క్రుంగజేసియును । ధారుణిలో నే ధన్యత నొందెద ॥కౌర॥

దుర్యో॥ పారుడ నీవిపుడూ నాతో । పోరుజేయ గలవా వారీ । పూరూరును సంచారము జేయుచు । కోరిభుజించెటి వోరిమూర్ఖ నిలు ॥పా॥

భీము॥ క్రోధము హెచ్చెనురా వారీ । కోలహాలమునననూ నిన్నూ । పాదుగ నిన్నిట బవరమునందున । నీదోర్బలమును నిప్పుడె జూపెద ॥క్రో॥

దుర్యో॥ వాదు పరాక్రమమూ దెలియక । వాదుజేసెదారా వారీ । పేద పారుడా పక్కమ్ములచే । యీ ధరణిలో నిను యిప్పుడె గూల్చెద ॥వాదు॥

భీము॥ భూప వేగయిపుడూ నీవీ । బాపని బలమెరుగా లేవుర । దాపుయెనరొ యిక దలచుకోర నీ । యేపు మాపియును యేగెద చూడర॥

దుర్యో॥ కోపము హెచ్చెనురా నిన్నిక । క్రుంగజేసెదనురా చోరా। యీపట్లను నే యికవిడువకనూ । రూపుమాపెదను బాపని కూరిరా ॥కో॥

భీము॥ యెందుకు పదిరెవురా కౌరవ । పదనిన్ను యిపుడూ బట్టియు । చిందరవందరజేసియు యిచ్చట । అందరుగాంచగ హతిమొనరించెద ॥యెందుకు॥

దుర్యో॥ పొందుగ నీవిపుడూ నాతో । పోరుకు నిలువుమురా వారీ । అందముగను పెదకందుకూరి గో । విందయనుచు నిను విడువక ద్రుంచెద ॥పొందుగ॥

భీముని - వృత్తము

పారుల మర్మము పరీక్షించకను । పోరుజేసెదా పొంతి గురించియు । కూ్రరయిపుడు యిట పోరాడగలేవ్ । పారిపొమ్ము నీపొరి జేరగను ॥

దుర్యో-వ॥ ఆహా యిప్పుడు యిచ్చట నిలచిన వీనితో నామరణంబే శిద్ధంబగుచున్నది యిక యీ పోరు చాలించి వెళ్ళెదగాక.

సూ-వ॥ యిట్లు దుర్యోధనుడు వెనుకకు తిరిగి వెళ్ళగనే కర్ణుడు ముందుకు రాబోవగ అర్జునుడుగాంచి అనుట.

కర్ణు-వ॥ వరే విప్రులారా నిలువండి మీా మధంబణంచెదను.

కర్ణునికి అర్జునునికి - వాదం

అర్జు॥ దురాచార మాపరాక్రి మెరుగక । దురంబునకు బూనితివౌరా । కరాయుధంబుచె కంఠము దరిగియు । కాలుని పురముకు ఘుడియలా బంపెద ॥దురా॥

కర్ణు॥ పరాక్రముండనని పలికెవు లావును । బవరము నందున నిలువుమిరా । సరాసరిగ నిను సంగర మందున । సంహారించకను విడువనురా ॥

అర్జు॥ దురియోధనునీ ప్రియసఖుండవై । దురముజేయు వచ్చితివౌరా । కరశరంబుచే కదనము నందున । కంఠము ఛేదించెద వినరా ॥

కర్ణు॥ దురాచారుడగు ద్రుపదుని పక్షము । దూరితివిక నిలు నిలువుమిరా । శరజాలంబుల సరగున విడచియు । సమస జేసెదను సమరము నందున ॥దురా॥

అర్జు॥ బలువగు బాణంబులు సంధించియు । యిలనిను గూల్చక విడువనురా । నిలునిలువర నీబల పరాక్రిమును । నింతలో జూపియు నేగెద నేనిక ॥బలువగు॥

కర్ణు॥ పలువనీదు పలుకులకు వెరచియూ । పారిపోవు వాడను గానూ । ఖలమతీ నిన్నూ కదుల నివ్వకను । కందుకూరీశుని కరుణచె ద్రుంచెద ॥పలుప॥

అర్జునుని - దర్వు - చెల్లి

చెనటి నిన్ను నాచేతి శరంబుచె । చీకాకొనరించెద నీచాధమ ।
ఘనవాక్యులచే ఘనత జూపెద । గనుగొనరా నా ఘనభుజబలమును ॥

కర్ణు-వ॥ అబ్బబ్బా వీనియుద్ధమునకు నిలువ వశంబుగాదు పోరు చాలించి వెళ్ళెదగాక.

సం-వ॥ యిట్లు కర్ణుడు వెళ్ళగనే

సైంధవుడు ముందుకువచ్చి అనుట

వ॥ వరెవరె భూసురులార భిక్షమెత్తుకొని జీవించె హాస్రిలకు యింత మధమా నిలువుడి నిలువుడి మీ పొగరణగించెదను.

సైంధవునికి నకులునికి - వాదం

నకు॥ వరే సైంధవా వదిరెద వేలర । వచ్చెను బాణము గనుగొనరా । కరశరముచె నీ కాయము దరగియు । ఘడియలో బంపెద కాలుని పురముకు ॥వరె॥

సైంధ॥ విఱవిగ నేనే వీరవరుడ ననుకొని । వి(ఱ)వీగుచును బలికెవురా । అరమర లేకను ఆదిమిపట్టి నిను । అవనికి బలియొసగెద వినరా॥

నకు॥ అధమా నిన్నిట పదనుశరంబున । వధగావించక విడువనురా। మదవతి కొరకై మరణమయ్యెదవు । మరలిపొమ్ము కా మాయెడ నిలువక ॥

సైంధ॥ వృధా వాక్కులును వాదురుచు లావుగ । వెధవాయిట నిలచెద వారా । పెదకందుకూరి మదన జనకునీ । మదిలొదలచి నీ మద మణగించెద ॥వృధా॥

నకులుడు రౌద్రమున

చెల్లి

పరిహాసముచే పలుకులు బలుకుచు । బవరమునకు నిలచెదవారా ।
సరిగా గనుగొను సైంధవ యిదుగో । శరజాలంబుల సరగున విడచెద ॥

సైంధ—వ॥ ఆహా యీ భూసురుని ఆర్భాటంబుకు నిలువనోపకుంటిని యీ సంగరంబుచాలించి వెళ్ళెదగాక.

సం—వ॥ యిట్లు సైంధవుడు వెళ్ళగనే

శకుడువచ్చి అనుట

వ॥ వరెవరె విప్రకూరులార నిలువు నిలువండి మీ మధంబణంచెదను.

శకునికి సహదేవునికి – వాదం

సహ॥ వరే శకుడనిను వదులక బట్టికు । వధగావించెద నిలువుమిరా । పరాక్రమండనని పలుకుచు వస్తివి । బలపరాక్రమునను జూపెద క్షణమున ॥వరే॥

శకు॥ సరాసరిగ నినుసంగరమందున । సంహరించకను విడువనురా । కరమున నున్న ఖడ్గముచే నీకంఠము దరిగెద కలుషాత్మక యిట ॥సరా॥

సహ॥ కూరిర పెక్కుగను మీరి బలికెదవు । కృంగజేసెదను కుటిలాత్మకయిట । పాపుని మర్మము పరీక్షించకను । పోరుజేసెదవు పొగరణగించెద ॥కూరి॥

శకు॥ ధారుణిలో నీ పేరుమాపియును । ధన్యత నొందెద యిక వినరా । భూరి కందుకూర్ నారాయణునేల్ । శౌరిని దలచియు జయమును నొందెద ॥ధారుణిలో॥

సహదేవుని – దర్వు – చిత్తి

బవరము నందున పారక నిలువర । జరిమార్చెద యీ పటుశరమునువిడ । సవినయముగ నా సాహసంబుచే । సంహరించకను విడువర నిన్నిక ॥

శకు–వ॥ అయ్యయ్యో యిక యేమి చేయుదును వీనిఘాతలకు నిలువజాలను పోరును వదలి ప్రాణంబు దక్కించుకొనియెదను యిచ్చట నిలచినచో మరణాంబే శిద్ధంబగుచున్నది యిక వెళ్ళువాడను.

సం-వ॥ యిట్లు యోధులందరు నిలువలేక వెళ్ళినంతలో
భీమార్జునులు ధర్మరాజును గాంచి

వ॥ అన్నయ్యా శ్రీకిృష్ణపరంధాముని కృపవలన మీా ఆశీర్వచనము వలన యీా కౌరవ పందలను పారదోలితిమి గాని యిపుడు యింకేమి ఆలోచనయో విన్నపుడు.

ధర్మ-వ॥ సహోదరులార యీా ద్రౌపతిని వెంటగొని మన జనని సన్నిధికి జనుదాము రాండు.

భీము-వ॥ చిత్తము.

చెలి

రాధేక్రిష్ణ గోపాల కిృష్ణా ॥

కుంతీదేవిని గాంచి అనుట

వ॥ జననీ నొక ఫలంబుగొనివచ్చితిమి తమయాజ్ఞయేదో విన్నవము.

కుంతి-వ॥ కొమారులార యాఫలంబును మీారు యేవురు యేకీభవించి అనుభవించుడు యిదియె నాయాజ్ఞ.

ధర్మ-వ॥ జననీ విచారించకనే వాగ్దానించితివి మేము దెచ్చినది ఫలంబుగాదు అర్జునుడు స్వయంవరములో మత్స్య యంత్రంబు భేదించి ద్రౌపతిని చేకొనినాడు.

ద్రౌప-వ॥ అత్తయ్యా వందనములు.

కుంతి-వ॥ శీఘ్రమే కల్యాణ ప్రాప్తిరస్తు.

కుంతి-వ॥ ఆహా నేను వెనుకముందు విచారించకనే యెంతమోసము జేసితిని. భీముని వాక్కు నిజమని సముద్రంబున బల్కితిని. తనయులార మీాలో మీాకు కలహంబయ్యె విధానంబయ్యెను యిక యేమి చేయుదును.

కుంతికి ధర్మరాజుకు - వాదం

కుంతి॥ తనయులార మీాకు నేను తగని కలహమును బెడితిని। వీన యముగను ద్రౌపతి యే విధిమెలగును యేవురిలో ॥తన॥

ధర్మ॥ జననీ నా మనమునందు ఘనవ్యాకులమును గలిగెను అనుజుని వాక్కును నమ్మియు ఆజ్ఞయిస్తి విపుడు మాకు ॥జననీ॥

కుంతి॥ యీ విధాట దెలియనైతి యేమిజేయుదిక నేను । యేపుర పురుషులకొక సతి యేయుగమున లేదాయెను ॥యీవి॥

ధర్మ॥ భూవరులీ వాక్కువినిన యేవిధిహేళన జేతురో । యీవసుధలో కందుకూరి యీశునీ కృపయెటులున్నదో ॥భూవ॥

వ॥ జననీ యీ ఆలోచన ఆపత్కాల బాంధవుడైన శ్రీక్రిష్ణ పరంధాముడే యెటుల జేయునో నామనంబున కెద్దియుక్ దోచుటలేదు.

సం-వ॥ యిట్లు కుమ్మరివారి భవనంబున పాండవులు నివసించి కుంతిదేవితో విచారగ్రస్తులై యున్నంతలో.

త న లో

దృప-వ॥ ఆహా నాప్రార్థంబెంతని గొనియాడనగును. పాండవమధ్యముడగు అర్జునునికి నాసుకుమారియైన ద్రౌపతిని నొసంగి వివాహంబుగావించెదనని వాగ్దానించి యుండగ అట్టి ప్రితాపశాలి మరణించినందులకు ద్రౌ ప తి దే వి పేదవిప్రుని పాలిటబడియుండ నాయెనుగదా దైవమా నాకెద్దియుక్ దోచకుండెను. మత్స్యయంత్రమును భేదించిన వారికి భూసుర రూపలక్షణములులేవు వారి దృఢభావము పరీక్షించుటానకు నా తనయుండగు దృష్టద్యుమ్నుని దోలెదగాక.

సం-వ॥ యిట్లు వ్యాకుల పడుచు కొడుకును బిలచి అనుట.

వ॥ తనయా నీవిప్పుడు కుమ్మరవారి భవనంబునకుక్ జని రహస్యముగానుండి ద్రౌపతిని చేకొని పోయినవారు యే వర్ణస్థులో వారి ధృఢభావన గనుగొనసరమ్ము పొమ్ము.

దృష్ట-వ॥ జనకా ఆవిధమే కనుగొనెద గాక.

చ ర్ణి

రాధేక్రిష్ణ గోపాలక్రిష్ణా ॥

సం-వ॥ యిట్లు దృష్టద్యుమ్నుడు వచ్చి పొంచు వినుచుండగా.

## ధర్మరాజు అనుజులతో అనుట

వ॥ అనుజులార సదా శ్రీకృష్ణ పరంధాముని ధ్యానంబు వీడరాదు యెంత ఆపత్కాలము వచ్చిన అసత్యము త్రోసివేసి సత్యముగా ప్రవర్తింప వలయును. అపకారికి నుపకారము చేయవలయును. శరణుజొచ్చిన వారిని రక్షించ వలయును. డంబాచారము వదలి ధర్మముగా చరించ వలయును. నేను అను హంకారమును వీడవలయును. పరిశుభ్రముగా నుండవలయును. అసత్యము యెన్నటికైనా హానిచేయును సత్యము వృద్ధిజేయును. పరుల వాక్కు విన్నవారికి చేటుగలుగును. స్వయంగజేయు కార్యము సఫల మగును. క్షత్రియ ధర్మమువీడరాదు. సహోదరులార యివి దేవవాక్కులని నమ్మికొని మెలంగుడు యిదియె నామనవి.

## భీమార్జునులు

వ॥ అగ్రజా మీవాక్కు యెల్లప్పుడుమాడెందమునందున నమ్మి చరించు వారము.

సం—వ॥ యిట్లు సంభాషించుచుండగా దృష్టద్యుమ్నుడు విని.

## తనలో

వ॥ వోహో వీరలు భూసురులుగారని నిశ్చయంబాయెను యిక మాజనకుని సన్నిధికరగి యీ వార్త దెల్పెదగాక. (అని తండ్రితో)

వ॥ నాయినా నేను జనియూ మహనీయుల వార్తలెరంగి వచ్చితిని గాని వారినుడువులు పినగక్షత్రియుల విధానముగా సంభాషించు చున్నారు. యెంత పరీక్షించినా గాని విప్రుల పోలికలు లేవు.

ద్రుప—వ॥ సరియె వార్ని యింకా పరీక్షించుదాము సేవకులార మీరలిప్పుడు వొక రథమును వొక మ్యానను తీసుకొని అందులో యెల్లప్పుడు క్షత్రియులు ధరించె ఆభరణంబులు విప్రులు ధరించె వస్త్రం బులు నిడుకొని కుమ్మరవారి సదనంబునకుజని యచ్చటనున్న వారు లను యీ వస్త్రంబులు ధరించుకొని రాండని నావచనంబులు దెల్పి యిచ్చుటకి దోడ్కొని రాండు పోండు.

సేవ-వ॥ చిత్తము మహాప్రభో మీరను విధంబుగనే పోయి వార్ని దోడ్కొని రాగలము.

చెల్లి

రాధేకిృష్ణ గోపాలకిృష్ణా ॥

సం-వ॥ యిట్లు సేవకులు కుమ్మరి వాని గృహంబుజేరి పాండవులను గాంచి అనుట.

వ॥ మహాత్ములార ద్రుపద మహారాజు వొక రథమును వొక మ్యానను బంపించినాడు. అందులో వున్న ఆభరణాబులను ధరించుకొని మమ్ముల రమ్మని సెలవొసంగినాడు రాండు జనుదాము.

ధర్మ-వ॥ సరెసరె ఆవిధమె రాగలను అనుజులార ద్రుపదు డిప్పుడు క్షత్రియులు ధరించె ఆభరణంబులు విప్రులు ధరించె వలువలు బంపించి నాడు. యిప్పుడు మనము క్షత్రియ భూషణంబులు ధరించుకొని యీరథ ముపై జనుదాము ప్రియాణమునకు త్వరపడుడు జననీ మీరిరువురు యీ మేనలో నివసించి రాండు.

తమ్ము-వ॥ అన్నయ్యా మీరను విధంబుగనే కవచములు దాల్చి తిమి యిక జనుదాము పదుడు.

చెల్లి

రాధేకిృష్ణ గోపాల క్రిష్ణా । మాధవః మదుసూధన శ్రీక్రిష్ణా ॥రాధే॥ క్రిష్ణ క్రిష్ణా గోవింద క్రిష్ణ । గోవర్ధనధర గోపాల క్రిష్ణా ॥

సం-వ॥ యిట్లు హరిని స్మరించుచు సభజేరవచ్చి యేవురు సింహాసనములపై నివసించగనే ద్రుపద మహారాజు గాంచి అనుట,

పాండవులకు ద్రుపదునకు - వాదం

ద్రుప॥ శరణు మహావీరులార చయ్యన మీ వివరమెల్ల । త్వరలో వినుపింపుడయ్యా తత్తరపడుచుంటి యిపుడు ॥శర॥

ధర్మ॥ పరితాప మదేల ద్రుపద పాండవేయులము మేము । కరి పురంబు మానెలవూ కదన విజయులీ అనుజులు ॥పరి॥

ద్రుప॥ వర కొమారులార నాదు వాంఛయు నెరవేరె యిప్పుడు। పరమపదవి జేరినరని పరితాపము నొందుచుంటి ॥వర॥

ధర్మ॥ కరివరదుని కృపవలనా కాలము గడుపుచునుండగ । వర కొమారి స్వయంవరము వార్తవినియు వచ్చినాము ॥కరి॥

ద్రుప॥ భవుని కృపావలన లక్కభవనముడిండియు నెటులా। సవినయముగ వెడలితిరో సమర వీరులార మీరు ॥భవు॥

ధర్మ॥ భవనము కగ్నియు రగులగ పవనాత్మజుడూ మమ్ముల। భవత్ పరితాపమువల్లను బ్రితికించెను ఆసమయము ॥భవ॥

ద్రువ॥ సుందర స్వరూపులార సుయోధనుడు మిములోర్వక । మంద బుద్ధిబూని యిట్టి మహాపరాదంబు జేసె ॥సుందర॥

ధర్మ॥ పొందుగ పిదకందుకూరు సుందిర నిలయూడగు గో । విందుని కృపవలన పుడమియందున జీవించినాము ॥పొందుగ॥

వ। ద్రుపదభూపవరేణ్యా శ్రీకృష్ణ పరంధాముని పాదకృపవలన యా అగ్ని గండంబు దప్పి జీవించి భూసురవేషంబులు దాల్చి యేకచక్రపురములో కాలంబు గడుపుచుండగ ద్రౌపది స్వయంవరము వార్తవిని యిట కరుదెంచినాము.

ద్రుప-వ॥ ధర్మజ మత్స్యయంత్రంబు ఛేదించినవారికి ద్రౌపది నొసంగెదనని ప్రతిజ్ఞబూనియుంటిని గాని పెద్దవాడవు నీవుండగ ఫల్గుణునకు నెట్లు వివాహమగును కావున యిందులకు యేమి ఆలోచనయో విన్నవడు.

సం-వ॥ యిట్లు అనుచుండగ కుంతీదేవిగాంచి అనుట.

వ॥ అన్నయ్యా యీ ద్రౌపతిని నాసుకుమారు లేవురికి పరిణయంబు జేయవలసి వచ్చెను వాయుజుండు వచ్చి జననీ ఫలంబు గొనివచ్చినారమని దెలుపగ నేను విని తనయులార మీరు అయిదుగురు యేకీభవించి అనుభవించుడని వాగ్దానంబొసంగియుంటిని కావున యిందుకు నీవు యేమని యెదవో.

ద్రుప-వ॥ చెల్లెలా వొక్క సతిని యేవురుపతులేవిధంబుగా భావించుకొగలరు యీ సమస్య నేను వొప్పజాలను.

సం-వ॥ యిట్లు అనుచుండగ

వ్యాసులవారుగాంచి అనుట

వ॥ దృపద మహరాజు యీ కుంతీ దేవి వాక్కులు వేదవాక్కులని నమ్మవలయును కావున నీసుకుమారియగు ద్రౌపది పారబ్ధం బిట్టులనే యున్నది నీవు సందేహించక పంచపాండవులకు పరిణయ మొనర్పుము.

దృప-వ॥ వ్యాసమునీంద్రా ద్రౌపది పారబ్ధంబిట్లౌటకు కారణ మెద్దియో విన్నవించుము.

వ్యాసులవారికి దృపదునకు – వాదం

వ్యాసు॥ దృపదా మహారాజా వినుమీ । ద్రౌపది వార్తయునూ పూర్వము । తపము జేసియూ దాతతో వరమూ । అపుడు గోరెను ఐద్గురి నరులను ॥దృపదా॥

దృప॥ యెపుడను మీవాక్కు నమ్మెయు । యిపుడు యేవురికి నీసుతనూ । తపసి చంద్రమా దైనకృపచె నిడి । దనరగ లగ్నంబును గావించెద ॥యెపు॥

వ్యాసు॥ మితము దప్ప కానూ నీవూ । మేదినీశ యిపుడూ వేగమె । సుతకు యేవురూ పతులాయెనని । క్షితిలో గుందుట మాని యొసంగుమి॥

దృప॥ క్షితిలో వెదకందుకూరా । పతిత పావనూనీ కరుణచె । అతిసమ్మోదమున ఐద్గురికిని ద్రౌ । పదినిడి లగ్నం హితవుతో జేసెద ॥క్షితి॥

వ॥ వ్యాసమునీంద్ర మీరుదెల్పిన ప్రకారము పంచపాండవులకు ద్రౌపదికి వైవాహికం బొనర్చువాడను.

సం-వ॥ యిట్లు దెల్పి మృదంగవాయిద్యములతో పచ్చని తోరణం బులగట్టి ముత్యాల ముగ్గులు బరచి కల్యాణ మంటపము శృంగారించి జయజయ ధ్వనులతో పంచపాండవులకు ద్రౌ ప దీ దే వి కి వివాహంబు గావించుట.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవా । తారాబలం చంద్రబలం తదేవా
విద్యాబలం దైవబలం తదేవా । లక్ష్మీపతేంఘ్రీం యుగస్మరామీ ॥
స్నానధాన సుముహూర్త స్నావధాన శుభలగ్న స్నావదానా ॥

వం-వ॥ యిట్లు వివాహంబొనర్చి సకలజనులు సంతోషంబు నొందుచు నక్షావనుల మోాల శ్రీక్రిష్ణపరంధాముని పేర మంగళహారతు లొసంగుట.

## మంగళహారతి

శ్రీరాధలోల క్రిష్ణ నీరాజనమిదొ హరి। నిఖిలలోకధారీ ॥శ్రీరాధ॥ కారుణ్యాకర రావా। కలుష సంహారాదేవ। కోరితి నీసేవయు నా నేరము లెన్నకను గొనుము ॥శ్రీరాధా॥ దాసుల హృదయ నివాసా వాసుదేవ రావ। శేషశయన బ్రోవ। దాశరథే నీనామము ధ్యానమరువనూ సదయము। గాసి దొలుగ జేయుము శ్రీకేశవనిను నమ్మియుంటి ॥శ్రీరాధ॥ శ్రీవేణుగానలోల శ్రితజన పరిపాలా। సేవిత కవిలోల। భావజ జనక మురహారి। పావనాంగ గిరిధారీ। దేవ నీదు స్మరణయు నాభావమునను మరువశౌరి ॥శ్రీరాధ॥ ధారుణి పెదకందుకూరి నారాయణపోషా। రార హేపశ్రేశ। సారసాక్షి గోపబాల। సన్మునీంద్ర పరిపాల। కూరిమితో గైకొను కర్పూర జ్యోతినిదుగో జయ ॥శ్రీరాధలోల క్రిష్ణ॥

## తేది

కం॥ ధర హేవళంబి సంహా
త్సర శ్రావణ శుక్లపక్ష ♦ షష్ఠీ తిథియుఀ
గురువారము నాటికి యీ
చరితంబును ముగిసె భువిలో ♦ జయమును వెలుగఀ ॥

## సంస్కర్త మనవి

కం॥ మెప్పగు యీ గ్రంథంబున
తప్పులు గలిగుండెనేని ♦ తగదిద్ది యిలఀ
వొప్పుగ జేసిన వారిని
నెప్పుడు గురుభావకముగ నే ♦ దలచెదనూ ॥

గద్య

జిల్లా నల్‌గొండలో చేరిన తాలూక భువనగిరి మఖాం॥
పెదకందుకూరు నివాసులగు గౌడకులజులగు ముప్పిడి
మల్లయ్య ముత్తమ్మ ప్రియ కొమారుడగు
నారాయణచే యీ చిరుతల భజన ద్రౌపది
స్వయంవరము రచియింపబడి గౌరాయ
పల్లి అంబేద రాజవీరప్ప గారిచే
పరిశోధింపబడియె తేది శాలి
వాహనశకం ౧౮౭౯ వరకు
శ్రీ సమాప్తం

శ్రీ శ్రీ శ్రీ

---

## హెచ్చరిక.

ఈ "ద్రౌపదీ స్వయంవరము" అను పుస్తకము యొక్క సర్వాధికారములు మాకే చెందియున్నవి. దీని నితరులు ఏవిధముగా అనుకరించిననూ తగిన ప్రతీకార చర్యలు తీసుకొనబడును.

ఇట్లు
ఫర్ మెస్సర్స్ కొండా వీరయ్యా అండు సన్సు,
సం॥ కొండా గౌరయ్యా
పార్ట్నర్.

---

కొండా వీరయ్యా అండ్ సన్స్ గారి
శ్రీభారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.
సత్యనారాయణపురం — సికింద్రాబాద్.